Photo by Pranlal K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

లేమి బాధ

పంపినవారు:
ఆర్. లక్ష్మీనారాయణ - ట్రిప్లికేన్

# చందమామ

సంచాలకుడు:
'చక్రపాణి'

'సఫలయాత్ర' అనే చిన్న కథను ఈ సంచికలో మీరు చదవబోతున్నారు. ఇది 'జాతకకథల'లో ఒకటి. జాతక కథలనగా గౌతమబుద్ధుని పూర్వావతారానికి సంబంధించినవి. ఈ మహత్తర గాథలు ఇప్పటికి సుమారు రెండు వేల నాలుగువందల ఏళ్ళకు పూర్వపువి. ఆనాడు ప్రపంచం, బుద్ధుణ్ణి దేవునికంటె ఎక్కువగా చూచుకొన్నది. ఆ మహానుభావుడు దుష్టశిక్షణకోసం, శిష్టరక్షణకోసం జన్మించాడని నమ్మింది. కనుకనే, బుద్ధావతారం దశావతారాలలో ఒకటిగా పరిగణింపబడుతున్నది. మానవునకు మొదట కావలిసింది మనోనిగ్రహమనీ, జీవితంలో దయాధర్మాన్ని మించింది మరిఒకటి లేదనీ, రెండు ఆర్యసత్యాలను బుద్ధుడు బోధించాడు. ఆ మహాత్ముని బోధలే జాతకకథలుగా వెలిసినై. విజ్ఞానదాయకమైన ఈగాథలు భరతఖండమందేగాక టిబెట్, చైనా, జావా, సుమెత్రా, సింహళ దేశాలలోకూడా వ్యాప్తిచెందిఉన్నై. ఈ అపూర్వగాథలను ఏర్చికూర్చి, మేము చందమామ పాఠకులకు వరసగా అందించబోతున్నాము.

సంపుటి 12 :: మార్చి 1953 :: సంచిక 3

SANKAR...




# ఇద్దరు భక్తులు

భక్తు లిద్దరు మున్నొకప్పుడు
పండరీపుర యాత్రకై కడు
పరితపించి చెన్నాళ్ళనుంచో
డబ్బుకూడా కూడబెట్టారు.

ఇరువురిది శుభసమయ మనుకొని,
ఒక్కరోజున కాచి దాచిన
డబ్బు చేగొని, సంతసంగా
యాత్రకోసం బయలుదేరారు.
ఇద్దరూ తమ వాంఛితార్థం
వైపు దీక్షగ సాగుతున్నారు.

ఇంతలో ఒకచో అనాథుడు
అతి దరిద్రుడు వృద్ధు డొక్కడు
బాధపడుతూ కొనూపిరితో
త్రోవపక్కన కానవచ్చాడు.

అతని వెత గని మొదటి భక్తుడు
నొచ్చుకొన్నాడెద కడుంగడు
'దిక్కు ఎవరిట? ఆర్తు డీతడు,
వదిలివెళ్ళుట మెలా?' అన్నాడు.

అతని పలుకులు విన్న మిత్రుడు
'బలేవాడివి. వీడు ఎవ్వడు?
త్రోవలో తగలాట మెందుకు,
సాగవయ్యా ముందు'కన్నాడు.



మొదటి భక్తుడు ఒప్పలేదిది.
'నీవుపద, నాకదను కాదిది,
వెనుక వస్తా'నని ఎలాగో
వెళ్ళకుండా తప్పుకొన్నాడు.

సాటిభక్తుడు వెళ్ళినంతట
వృద్ధు నొకచో జేర్చి వెంబట
ఉన్న రొక్కం ఖర్చుబెట్టీ
మందు తెచ్చీ, సేవజేశాడు.

కొన్నినాళ్ళకు ముసలి కోల్కొని
దేవునిగ కొనియాడి భక్తుని,
వెళ్ళిపోగా, డబ్బు కరువై
భక్తు డింటికి తిరిగిపోయాడు.




రచన:
బైరాగి



కాని రెండవభక్తు డక్కడ
పండరీపురమెళ్ళి గుడికడ
స్నేహితుడు తనకన్న ముందే
ఉండటం కని తెల్లబోయాడు.

అడుగుదా మనుకొనేలోపల
మాయమిత్రుడు మాయమయ్యాడు.

పిదప ఇంటికి మరలివచ్చిన
వెంటనే అడిగాడు మిత్రుని.
అతడు 'రాలేదక్కడకు నే'
నన రహస్యం తెలుసుకొన్నాడు.

# అట్టి వినా ది బొ వ్మ

ఒకరోజున ద్రోణాచార్యులు, తన శిష్యులైన కురుపాండవులను వెంటబెట్టుకొని గంగానదీతీరానికి వెళుతున్నాడు. దారిలో ఒక అశ్వత్థవృక్షం కనిపించింది. వెంటనే ఆయన అర్జునుణ్ణి పిలిచి, 'ఇవాళ నేను అభ్యంగనం చేదామనుకొంటున్నాను. నూనే, సున్నిపిండీ తెచ్చిపెట్టు'మంటూ, అతనిని పనిమీద పంపించాడు.

అర్జునుడు వెళ్ళగానే, ద్రోణుడు దుర్యోధనుని పిలిచి, "నాయనా! నీకొక కొత్త విద్య చెబుతాను, నేర్చుకో"మని అంటూ, రావిచెట్టుకింద చక్రంవేసి, మంత్రరహస్యం చెప్పి, ఆ వృక్షానికి బాణంవేసి కొట్టమన్నాడు. దుర్యోధనుడు కొట్టాడు. చెట్టుమీద గల ప్రతీ ఆకునకూ ఒక్కొక్క రంధ్రం పడింది.

తరువాత అందరూ గంగానది చేరుకొని స్నానంచేస్తున్నారు. ద్రోణుడివద్ద మాత్రం ఎవ్వరూ లేరు. ఆయన కాలుపట్టి ఒక మొసలి ఈడ్చుకుపోతున్నది. ద్రోణుడు కేకవేసేసరికల్లా కౌరవులందరూ పరుగెత్తుక వచ్చారు. ఎంత యత్నించినా ఆ మొసలిని విడిపించలేక, వారు తెల్లబోయి చూస్తూ వున్నారు.

అంతలో, గురువుకోసం నూనే, పిండీ తెస్తూవున్న అర్జునుడు అశ్వత్థవృక్షం దగ్గిరకు వచ్చాడు. చెట్టుఆకులన్నీ రంధ్రాలుకలిగి చిత్రంగా కనిపించినై. కిందచూస్తే మంత్రచక్రం కనబడింది. చక్రంచూస్తూ అర్జునుడు గాండీవంతో చెట్టుకు సంధించి కొట్టాడు. వెంటనే ఆకులన్నిటికీ మళ్ళీ ఒక్కొక్క రంధ్రం చొప్పున ఏర్పడింది.

అర్జునుడు వెళ్ళేసరికల్లా గురువు మొసలినోట్లో పడిపోవటం కనిపించింది. చూచాడు సవ్యసాచి. కొత్తగా నేర్చిన మంత్రం ప్రయోగించి కొట్టాడు. దెబ్బతో మొసలి శరీరమంతా సహస్ర రంధ్రాలు పడి, చచ్చింది! ఈవిధంగా ద్రోణునికి గండం తప్పింది.

తరువాత—అందరూ కలిసి ఇంటికి మరలిపోతూవుండగా అశ్వత్థవృక్షపు ఆకులకు రెండేసి రంధ్రాలు ఎలా వచ్చాయని ద్రోణుడు ప్రశ్నించాడు. 'నేనే కొట్టా'నన్నాడు అర్జునుడు. అప్పుడు ద్రోణుడు, తను చెప్పిన మంత్రాన్ని కౌరవులు మరిచిపోవటాన్నీ, స్వయంకృషిచేత అర్జునుడు విద్యనేర్చుకోవటాన్నీ వివరించి, ఉభయుల ప్రజ్ఞలకూ గల తేడాలను చూపించాడు.




ఒకప్పుడు బోధిసత్త్వుడు కాశీనగరంలోని ఒక వర్తకకుటుంబంలో జన్మించాడు. అతడు ఐదువందలబండ్లపై సరకువేసుకొని దేశాంతరంపోయి, వర్తకం సాగించేవాడు.

ఆ పట్టణంలోనే మరి ఒక వర్తకుడు ఉన్నాడు. అతడు యోచనాపరుడు కాడు సరికదా, పైగా దురుద్దేశాలు కలవాడు. ఒకరోజున బోధిసత్త్వుడు ప్రయాణానికి బళ్లు సిద్ధంచేసుకుందా మనుకొనేటంతలో రెండవ వర్తకుడూ బయలుదేరుతానన్నాడు.

అప్పుడు బోధిసత్త్వుడు అతనితో 'మిత్రమా!—నీబళ్లూ, నాబళ్ళూ ఒక్కసారిగా బయల్దేరితే దారిపట్టక యిబ్బంది కలగవచ్చు. అందువల్ల ఒకళ్ల తరవాత ఒకళ్లం పోయిరావటమే మంచిది. ముందు నువు బయల్దేరుతావా? నన్ను సాగమన్నావా? నీ వీలుచొప్పునే చెప్పు' అన్నాడు.

వర్తకుడు తనలో తాను 'ముందుగా పోతే నా మనుష్యులకు నవనవలాడే కూరలు దొరుకుతై. పశువులకు పట్టుకుచ్చువంటి పచ్చగడ్డి దొరుకుతుంది. స్వచ్ఛమైన తేట నీరు లభిస్తుంది. ఏదేశం వెళ్లినా, నా సరుకులకు యిష్టంవచ్చిన ధర అడుగవచ్చు. చూడగా, ముందు వెళ్లటమే లాభమనిపిస్తున్నది' అని అనుకొన్నాడు.

బోధిసత్త్వుడూ ఆలోచించాడు: 'ఎప్పటికైనా ఒకళ్ళు తొక్కినదారిని పోవటమే సులువు. ఒకసారి పశువులు మేసినచోట పచ్చిగడ్డి మళ్ళీ చిగురుపట్టి రెండింతలుగా మొలక లెత్తుతుంది. కూరగాయలూ అంతే. నీటివసతి లేనిచోట ముందు వెళ్ళినవాళ్ళు నీళ్లకోసం బావులు తీస్తారు. అవే మనకూ ఉపకరిస్తాయి. పోతే, కానిచోటులకుపోయి వర్తకంలో బేరాలాడటం తగనిపని.

హెచ్. ఆదినారాయణ



మొదట వెళ్లినవాళ్ళు ధరవరలు నిర్ణయించే వుంటారు. గనక, వెనకవాళ్లకు ఆ సాధక బాధకాలన్నీ తప్పిపోతై ' అని తలిచి, తను వెనకనే బయల్దేరతానన్నాడు.

చేరవలసిన ప్రాంతం అరవై యోజనాల దూరం. మధ్య ఒక పెద్ద ఎడారి. సరిపడ తినుబండారాలూ, పీపాలనిండా మంచి నీళ్ళూ జాగ్రత్తపెట్టారు.

ఈ సరంజామంతటితో రెండవ వర్తకుడు బోధిసత్త్వుణ్ణి బలేపాచిక వేశానని సంతోషిస్తూ, చాలాదూరం ప్రయాణంచేసి చివరికా బ్రహ్మండమైన యెడారి చేరుకున్నాడు.

కొంతదూరం పోయేసరికి, అతనికొక అపూర్వమైన రథం యెదురైంది. ఆ రథాన్ని ముచ్చటైన తెల్లటి గుర్రాలు లాగుతున్నై. బండిలో ఒక రాజపురుషుడు, కత్తులు కఠారులు, విల్లమ్ములూ ధరించిన పరివారం ముందు నడుస్తున్నది. ఆ జనమంతా గొప్ప వర్షంలో తడిసిపోయినట్టూ, బండిచక్రాలు ఎక్కడో బురదలో కూరుకుపోయినట్టూ, అనవాళ్ళు కనిపిస్తున్నయి. అందరూ తలలకు తామరతూండ్లు చుట్టుకుని, అరవిచ్చిన తామరపూవులు చేతపట్టుకొని వున్నారు.

బండిలో వర్తకుణ్ణి ఆపి రథంలోఉన్న రాజపురుషుడు ప్రసంగవశాత్తు అంటున్నట్టుగా 'ఏమివర్షమయ్యా బాబూ!—కడవలతో గుమ్మరించేసింది. అదుగో, ఆ అడవి దాటితే అంతా జలమయమే! ఏళ్లు, వూళ్లూ యేకమైనాయి. అటువంటి ప్రదేశానికి పోబోతూ, యిలా కష్టపడి పీపాలతో నీళ్ళు మోసుకపోవడ మెందుకయ్యా, చాదస్తం గాకపోతే!' అన్నాడు.

నిజమేనని నమ్మి, దూరాలోచన లేని వర్తకుడు పీపాలలో నీళ్లన్నీ పారబోయించి వేశాడు. తీరా చూస్తే, ఎంతదూరం పోయినా ఆ అడవి కనబడుతూనేవుందికాని, అది

చేరుకోవటంమట్టుకు జరగలేదు. వర్తకుని పరివారానికి దాహంవేసింది. తాగటానికి గుక్కెడు నీళ్లయినా లేకపోయినై. గొంతు లెండిపోయి, అంతా ఒక్కొక్కరే ఎడారిలో దిక్కులేక మరణింపసాగారు. అలా మరణించిన జనాన్ని రాజపురుష రూపంలోనూ, పరివారరూపంలోనూ వచ్చిన భూతాలు ఆహారంగా చేసుకున్నాయి. క్రమంగా దప్పికబాధవల్ల మనుషులలాగే ఎడ్లూ సోలిపోయినై. వాటినీ ఆ భూతాలు బలిగొన్నాయి. అక్కడ అస్థిపంజరాలు పోగులు పడినై! బళ్లలో సామానుమాత్రం అలానే వుండిపోయింది.

ఇది జరిగిన కొన్నిరోజుల తరువాత బోధిసత్వుడుకూడా అదేత్రోవను బయల్దేరాడు. అతడూ సరిపడిన తినుబండారాలూ, పీపాలనిండా నీళ్ళూ నింపుకొని, ప్రయాణమయ్యాడు. బళ్ళు యెడారివరకూ వచ్చేసరికి, బోధిసత్వుడు పరివారంతో "నాతో చెప్పకుండా ఎవళ్లూ ఒక్కచుక్కయినా నీళ్ళు పారబోయకూడదు. ఇక్కడ ఉన్న వన్నీ విషవృక్షాలు. నన్నడగకుండా వాటి నుండి ఒక్క ఆకైనా తుంపవద్దు' అని హెచ్చరికచేశాడు.



తీరా ఎడారిమధ్యకు వెళ్లగా, మునపటి లాగానే అపూర్వమైన రథంలో రాజపురుషుడు పరివారంతోసహా ఎదురువచ్చాడు. వాళ్ళ వేషాలు చూడగానే బోధిసత్వుడు సంగతి గ్రహించివేశాడు. ఇదివరకులాగానే రాజపురుషుడు నీళ్లపీపాలు చూచి వేళాకోళంచేశాడు. అప్పుడు బోధిసత్వుడు "కొత్తనీరు ముందు కనుపించనివ్వనీ, నిలవనీరు పారబోయటం ఎంతసేపు!" అన్నాడు. ఇక రాజపురుషుడు చేసేదిలేక జారుకున్నాడు.

ఐతే అతడు చెప్పినమాటలు బళ్లవాళ్లలో కొంతమందికి నమ్మకంతోచి పీపాల నీళ్లు

పారబోయటానికి సిద్ధపడ్డారు. అప్పుడు బోధిసత్వుడు వాళ్లతో—

"ఎడారిలో నీటివసతి ఉన్నట్లు ఎప్పుడైనా మీరు వినివున్నారా? మీలో ఒక్కళ్ళకైనా చల్లటి వర్షపుగాలి ఒంటికి తగిలిందా? కనుచూపుమేరలో ఒక్క చిన్న మేఘమైనా మీరు చూచారా? ఒక్కసారైనా మెరుపు మెరిసినట్టు కంటికి అగపడిందా? ఆ పెద్ద మనిషిచెప్పినట్టు ప్రదేశమంతటా గొప్పగా వర్షించిందనే అనుకొందాం. ఉరుములు యోజనాలదూరం వినబడతై కదా? మీ చెవులకు ఒక్క ఉరుమైనా వినబడిందా?" అని ఇలా ప్రశ్నలు వేసేసరికి, సమాధానం చెప్పలేక వాళ్లు తెల్లబోయారు. ఇక మారు మాటాడలేదు.

అప్పుడు బోధిసత్వుడు "చూడండి! వాళ్ళు నిజమైన మనుష్యులు కాదు. మానవాకృతి దాల్చిన భూతాలు. వాళ్ల మాటలు విని, మనం నీళ్లు పారబోసుకుని కూచుంటే, తరువాత దాహంవేసినప్పుడు గుక్కెడు నీళ్లయినా ఉండవే! దప్పివల్ల మనం మరణిస్తే, మింగెయ్యవచ్చునని వాళ్లవుద్దేశం. తెలిసిందా? కనుక, ఒక్క చుక్కయినా నీళ్లు పోనీయకండి' అని మళ్ళీ హెచ్చరించాడు.

అతనూ, పరివారమూ కొంతదూరం సాగేసరికల్లా రెండవ వర్తకుని ఐదువందల బళ్ళూ, వాటినిండా సామానులూ కనిపించినై. అక్కడ అస్థిపంజరాలు చెల్లాచెదురుగా పడివున్నయి.

ఇవి చూచి అంతా ఎంతో ఆశ్చర్యపోయారు. అప్పుడు బోధిసత్వుడు 'చూచారా? దూరాలోచన లేక నీళ్ళన్నీ పారబోసుకొన్నందువల్ల ఆ వర్తకునికి చివరికి ఏగతి పట్టిందో?' అంటూ వాళ్లకు అసలుసంగతి నచ్చచెప్పాడు.

తెల్లవారగానే, అతడు ఆ బళ్లనుకూడా తీసుకుని, వెళ్లదలిచినదేశం వెళ్లాడు. చాలా లాభం గడించి, పరివారంతోసహా క్షేమంగా తన నగరానికి వచ్చి, సుఖంగా వున్నాడు.






## 5

కాని—చిత్రభానుడికి రోజూ ఒక చిత్రమైన కల రావటం ప్రారంభించింది. ఆ కలలో ఎవడో కనబడి, "నాయనా, చిత్రభానూ!—నా ఆత్మకు శాంతి కలిగించవూ? చిత్రభానూ!—నా ఆత్మకు శాంతి కలిగించవూ?..." అని జాలిగా అడుగుతూ ఉండేవాడు.

పసివానికి ఇదేమీ బోధపడలేదు. రోజు రోజుకీ ఆ కలలో కనబడే వ్యక్తి ఇంకా యెక్కువ జాలిగా బతిమలాడినట్టు అనిపించింది.

ఇది కలగదా అని మొదట తేలికగా తోసిపుచ్చాడు, చిత్రభానుడు. కాని, అదేపనిగా రోజూ కల రావటంతోనూ, అంతకంతకు అవి ఎక్కువ కావటంతోనూ, పసివానికి జిజ్ఞాస కలిగింది.

ఏమీ పాలుపోక, ఒకనాడు ఈ సంగతి గురువుకు వెల్లడించి, 'ఇందులో అంతరార్థమేమైనా వున్నదా?' అని ప్రశ్నించాడు.

అందుకు మిత్రానందుడు "లేకేమి నాయనా!—ఇలాంటి కల నీకు రావటంలో ఎంతో అంతరార్థమున్నది. విను" అని ఇలా ప్రారంభించాడు:

"...ఒకప్పుడు ఇంద్రసభలో ఒకానొక గంధర్వుడు ఉండేవాడు. అతనికి యిద్దరు భార్యలు. పెద్ద భార్యకు ఒకడూ, చిన్న భార్యకు ఒకడూ కొడుకులున్నారు.

ఆ గంధర్వునికి దేవేంద్రసభలో గొప్ప ఉద్యోగం. ఆ వుద్యోగానికి గడువు ఇరవై సంవత్సరాలు. గడువు తీరినతరువాత అతని సంతతివారు ఆ పదవిని పొందవచ్చు.



సంతతి లేకపోయినట్టయితే అతడే మరి ఇరవై సంవత్సరాలు పనిచేయవచ్చు. ఇదీ ఆ ఉద్యోగం పద్ధతి.

ఇప్పుడీ గంధర్వుడికి ఉద్యోగకాలం పూర్తిఐపోయింది. న్యాయప్రకారం ఉద్యోగం అతని పెద్దకొడుకునకు రావాలి. ఐతే, వాడిని తప్పించివేసి తన కొడుకును ఆ పదవిలో పెట్టాలెనని చిన్నభార్యకు ఆశ కలిగింది.

చిన్నభార్య గడుసుది. భర్తను ఎక్కువగా ఆకర్షించగలిగిన చతురమతి. పోతే– పెద్దామె కొడుకు సాధువు. వానికి తల్లి ఎంతో పినతల్లీ అంతే. ఈ కీలక మెరిగిన చిన్నభార్య సవతిబిడ్డను చెరదీసి, "నాయనా!—నే నొక వ్రతము సంకల్పించి వున్నాను. ఆ వ్రతానికి దేవతలందరినీ ఆహ్వానించాలి. ప్రపంచంలో ఉండే పుష్పజాతులన్నిటితో వారిని పూజచేయాలి. ఇప్పటికి అన్నిరకాల పువ్వులూ అమరిపోయినై. నీలిరోజా మట్టుకు దొరికింది కాదు. దీనికోసమే వ్రతం నిలిచిపోయింది. ఏ శ్రమ అయినా పడి ఆ నీలిరోజా తెచ్చిపెట్టి, నా వ్రతం పూర్తిచేసే బాధ్యత నీది. వెళ్లు. అమ్మతో నే చెబుతాలే" అని చెప్పి, వానిని సాగనంపింది.

అనాడు ఎంతసేపయినా బిడ్డడు ఇంటికి రాకపోయేసరికి, వాని తల్లి కలవరపడి, వెతకనారంభించింది. ఇది కనిపెట్టిన చిన్నభార్య అక్కడికి వచ్చి "అక్కా!—కుర్రవాడికోసం నీవేమీ భయపడకు. 'స్నేహితులతో పోయి చిత్రమైన పువ్వులు కోసుకు వస్తాను' అంటూ, హడావిడిగా భూలోకానికి వెళ్లాడు" అనినమ్మేటట్టుగా చెప్పింది. కారణం తెలియటంతో పెద్దామెకు కంగారు తగ్గింది.

ఇంతలో—గంధర్వుని ఉద్యోగానికి తగినవానిని నియమించే రోజు వచ్చింది. అతని పెద్దకొడుకు అక్కడ లేకపోవడం చేత, తరువాత అర్హతగల తన కొడుకును



ఇంద్రసభకు పంపించింది చిన్నభార్య వానికే ఆవుద్యోగం లభించటంతో చిన్నభార్య సంతోషించింది.

ఈ సమయంలో తన కొడుకు అక్కడ లేకపోయాడే అని పెద్దభార్యకు మనస్సు చివుక్కుమనదా? ఏదో ఇందులో మాయ ఉండివుంటుందని ఆమె బుద్ధికి వెంటనే, స్ఫురించింది. తన కొడుకు పరిస్థితిని గురించి దివ్యదృష్టితో చూడసాగింది.

ఆరోజున పసివాడు, నీలిరోజాకోసం స్వర్గమంతా తిరిగాడు. ఎంత తిరిగినా దొరక్క పోవటంతో పాతాళానికి వెళ్ళాడు. అక్కడా దొరకలేదు. వరసన అన్ని లోకాలూ గాలించుకొంటూ పోయాడు. ఎక్కడా లభించింది కాదు. చివరకు, భూలోకమందు దొరకవచ్చునని అన్నారు కొందరు.

భూలోకానికి చేరుకుని, అక్కడ తోటలు, దొడ్లు, ఉద్యానవనాలు అన్నీ గాలించసాగాడు. ఏరంగు రోజా అయినా దొరికింది కాని, వానికి నీలిరోజా మట్టుకు ఎక్కడా కనిపించలేదు. అయినప్పటికీ, పినతల్లి వ్రతం భగ్నమవుతుందనే బెంగతో, విసుగూ విరామమూ లేకుండా అలా వెతుకుతూనే వున్నాడు పిన్నవాడు.




పెద్దభార్య నిజానిజాలు తెలుసుకొని సవతిమీద మండిపడింది: "ఓసీ దుర్మార్గురాలా!—నా పసివానికీ నాకూ ఎడబాపులు చేసి, నీవు పెట్టిన బాధ ఇంతంత కాదు. నీకూ నీ బిడ్డలకూ అలానే ఎడబాపులై, దుఃఖిస్తావుగాక! నా కొడుకును ఏ లోకానికైతే పంపివేశావో, ఆ భూలోకంతో నీకు సంబంధం ఏర్పడుతుంది. ఒకానొక రాజు నిన్ను పెళ్ళాడతాడు. నీ కొడుకే భూలోకమందు నీ కడుపున పుడతాడు. సృష్టిలో లేని నీలిరోజా నెపంతో మా తల్లీకొడుకులను యెలా అయితే విడదీశావో, కని విని ఎరుగని ఒక నెపంతో మీ తల్లీ కొడుకులకు






ఎడబాటు కలగబోతుంది. ఈ విధంగా నువు దుఃఖించితీరవలిసిందే!" అని శపించింది. తన బిడ్డను వెతికితెమ్మని తక్షణమే చెలికత్తెను భూలోకానికి పంపింది.

అక్క పెట్టిన శాపానికి తిరుగు లేదని తెలుసు చిన్నభార్యకు. వెంటనే సవతి కాళ్ళమీదపడి, క్షమిస్తేకాని విడువనన్నది. జాలిగుండెగల పెద్దభార్య హృదయంకరిగి, శాపవిముక్తికి మార్గం చెప్పి వెళ్ళిపోయింది.

అప్పుడు అక్కడికి వచ్చిన గంధర్వుడు సంగతులన్నీ గ్రహించాడు. 'జరిగిందానికి విచారించి లాభంలేదు. కానీ, అవసరమైనప్పుడల్లా నేను నిన్ను కనిపెడుతూనే వుంటాను లే!' అంటూ అనేక విధాల చిన్నభార్యను ఓదార్చాడు.

అంతలో శాపంపొందిన ఆ చిన్నభార్యకు స్వర్గలోకపు విషయాలన్నీ విస్మృతిలో పడిపోయినై. ఆమె అదృశ్యమయింది. ఆమె కుమారుడు కూడా తల్లిలాగానే విస్మృతిచెంది, అదృశ్యమయ్యాడు. స్వర్గలోకంలో అదృశ్యమైన ఆ గంధర్వకాంత మరిఒక స్త్రీరూపంతో భూలోకంలోని ఒక ఉద్యానవనం చేరుకున్నది.

అప్పుడు గంధర్వుడు తన కంఠహారం నుండి పది ముత్యాలు తీసి, ఆ పది ముత్యాలనూ పదిమంది పరిచారికలుగా మార్చి, గంధర్వకాంత చేరుకొన్న ఆ ఉద్యానవనానికి పంపాడు. వాళ్లద్వారా ఒక వీణకూడా ఇచ్చి పంపాడు.

గంధర్వకాంత చేరుకొన్న ఆ ఉద్యానవనం భల్లాణరాజ్యానికి అధిపతి అయిన ప్రమోదమహారాజుది.

ప్రమోదునికి పెళ్లి అంటే ఎంతమాత్రం యిష్టం లేకపోయింది. ఆ రాజ్యంలో ముఖ్యులు నావద్దకు వచ్చి గత్యంతరం చెప్పమన్నారు. వారికి నేనొక మంత్రఫలం ఇచ్చాను. అది పట్టుకువెళ్ళి, రాజుకు

తెలియకుండానే ఫలాహారంలో పెట్టి ఇవ్వగా దానిని రాజు ఆరగించాడు.

రాజు ఆ ఫలాన్ని ఆరగించటమూ గంధర్వకాంత ఉద్యానం చేరుకోవటమూ, సరీగా ఒకేరోజున జరిగింది. ఆనాటి రాత్రి రాజు నిద్రిస్తూవుండగా గంధర్వకాంత పాడిన వీణపాట వీనులవిందుగా వినిపించింది. ఉన్నవాడున్నట్టు లేచి, ప్రమోదుడు ఆ ఉద్యానానికి చేరుకొన్నాడు. ఆమె అతిలోకసౌందర్యానికి ముగ్ధుడై, పాట విని తన్మయుడై, ఇంతవరకు పెళ్ళాడనని భీష్మించిన రాజు ఆ గంధర్వకాంతను పెళ్లాడాడు.

తీరా వివాహం జరిగిన తరువాత, మంత్ర ఫలాన్నిగురించిన రహస్యం ప్రమోదునికి తెలియవచ్చింది. ఇంకిప్పుడు తెలిస్తేమట్టుకేమి? గంధర్వకాంతను రాజు మనసారా ప్రేమించే పెళ్ళిచేసుకొన్నాడు! అందుకని, తన ప్రజలు చేసిన ఈ పనికి ప్రమోదుడు సంతోషమే వెల్లడించాడు," అని చెప్పాడు.

తరువాత—గంధర్వకాంతకు మహీపాలుడు పుట్టడం, రాజు మందాకినిని వలచి పెళ్ళాడటం, ఆమెకు అర్ధకర్ముడు కలగటం, అప్పుడు మందాకిని మనసు మారిపోయి, తల్లియెదటనే మహీపాలుణ్ణి



అవమానపరుస్తూవుండటం – వరకు చెప్పి, మిత్రానందుడు మళ్ళీ ప్రారంభించాడు:

"తన కొడుకును తన కళ్ళయెదట మందాకిని పెట్టే బాధలు సహించలేక పోయింది. గంధర్వకాంత, చెలికత్తెలతో ఆలోచించింది.

'నేను ఎదుట వున్నట్టయితే నా బిడ్డడిని సవతి ఇంకా యాతనలు పెడుతుంది. నేను లేకపోతే? ఒకవేళ తన కొడుకునకే పట్టంకట్టాలని దుర్బుద్ధిపుట్టి, కుట్రయేమైనా చేస్తుందేమో!—ఐనా, నేను తొలగివుండి, ఒక మూలనుంచి ఆమె చర్యలు కనిపెట్టుతూనే వుంటా' అన్నది.




ఈ నిశ్చయంతో గంధర్వకాంత, కన్న బిడ్డను ఎడబాసి ఒకానొక నిర్జన ప్రదేశం చేరుకున్నది. ఆమె నిర్జనప్రదేశ మనుకొన్న ఆ రహస్య స్థలంలో, తనకూ చెలికత్తెలకు అగత్యమైన సదుపాయాలు అన్నీ అమరి పోయివున్నాయి !! ఈ చక్కటి ఏర్పాటులు ఎలా జరిగినవో తెలియకుండానే, వారు అక్కడ కాలక్షేపం చేస్తూవచ్చారు.

ఇలా ఉంటూవుండగా-తనకొడుకునుగద్దె ఎక్కించుదామనే ఆశతో సవతి మందాకిని తండ్రి ఐన కిరాతరాజుతోనూ, పురోహితుడైన రాజగురుతోనూ కుట్రలు సల్పింది. నాలుగేండ్లాయె దేశంలో పట్టిన కాటకం సాకుగా పెట్టి, మందాకిని సవతికొడుకును బలిపెట్టబోయింది.

ఇదంతా కనిపెడుతూవున్న గంధర్వుడు ఒక వృద్ధుని రూపంలో నిర్జనప్రదేశానికి ఎగిరివచ్చి గంధర్వకాంతకు ఈ విపత్తును గురించి చెప్పాడు. చెప్పడమే కాదు. ఆమె ఒక రాజహంసగా మారిపోగల శక్తినిచ్చి, ఆమెతోవున్న పదిమంది చెలికత్తెలనూ తిరుగా పది ముత్యాలుగా మార్చివేసి, కంఠహారంలో చేర్చి ధరించుకున్నాడు !!

అటుతరువాత—

సరీగా సమయానికి, హంసరూపంలో వున్న గంధర్వకాంత తన కొడుకును ఎగరేసుకుపోవటం, కోటలో మందాకిని విషంపుచ్చుకు మరణించటం, ప్రమోదుడు రాజగురును పట్టి కట్టడం, అతను మందపాలునితో చేరటం, కుట్రలోనించి తప్పి కొన్న కిరాతరాజు మనవడైన అర్ధకర్ముణ్ణి పెంచి పెద్దవానిగా చేయుటం, వానికి పెళ్ళి కావటం, ఆ అర్ధకర్ముడికి 'చిత్రభాను'వనే కొడుకు పుట్టటం..."—ఇంకా యేమో చెప్పబోతూవుండగా పసివాడు అడ్డుపడి,

"ఏమిటీ! చిత్రభానుడా !!" అని ఆశ్చర్యంతో ప్రశ్నించాడు.

అందుకు మిత్రానందుడు, "అవును నాయనా, అవును. నీవే అ చిత్రభానుడివి. ఈ భల్లాణరాజ్యం నీవే. ఇలా అంటే నీకు ఆశ్చర్యముగా వుందేమో. నీవు తలయెత్తుకో కుండా ద్రోహంచేస్తున్నవాడు ఆ పరమ దుర్మార్గుడు రాజగురే!" అంటూ, అంత వరకు జరిగిన చరిత్రఅంతా విప్పిచెప్పాడు.

తరువాత—

"నాయనా, చిత్రభానూ!—అనాడు హంసపై ఎక్కి కూర్చున్న మహీపాలుణ్ణి తల్లి ఎగరేసుకు పోతూవుంటే, వానికి అంతా అగమ్యమనిపించింది. అయితే, 'బలిపీఠం నుండి బయటపడ్డానుకదా, నా తల్లిని నేను చేరుకోగలిగానుకదా!' అని ధైర్యంచెందాడు.

ఆ బంగారుహంస అలా ఆకాశమార్గాన ఎగిరి, నదులూ కొండలూ దాటుకొనిపోయి, ఒకానొక ద్వీపంలో ఆగింది. దానిపేరే మంజుల ద్వీపం. ఆ ద్వీపాన్ని పరిపాలించే రాజు తపోవర్ధనుడు.

రత్నకిరీటధారి ఐన ఒక రాజకుమారుడు బంగారు హంసపై వచ్చి తన ద్వీపంలో దిగిన వార్త క్షణంలో తెలిసింది ఆ రాజుకు.

తెలియగానే తపోవర్ధనుడు ఆశ్చర్య పడ్డాడు. ఇది వరప్రసాదమే అని పొంగి



పోయాడు. పాదచారిగానే అత్రంతో వెళ్లి, ఆ తావుకు చేరుకొన్నాడు.

రాజును చూడగానే, హంసరూపంలో వున్న గంధర్వకాంత తననుగురించీ, కొడుకునుగురించీ పూర్తిగా చెప్పింది. మానవ భాషలో మాట్లాడిన ఆ హంసను చూచి చకితుడైనాడు తపోవర్ధనుడు. 'రాజా!— పసివాడిని నీకు వప్పగిస్తున్నా. నీదే భారం!!' అంటూ హంస ఆకాశంలోకి ఎగిరిపోయి, శాపవిముక్తి చెంది, గంధర్వలోకానికి చేరుకుంది.

దైవికంగా తనకు లభించిన పసివాణ్ణి, తపోవర్ధనుడు ముద్దుగా చూచుకొంటూ,

సమస్త విద్యలలోనూ వానిని ప్రవీణుడుగా చేశాడు. తన ఒక్కగా నొక్క కుమార్తెను ఇచ్చి వైభవంగా వివాహంచేశాడు.

ఐతే, విధివిలాసమేమోకాని, మహీపాలునికి అట్టేకాలం సంతోషం లేకపోయింది.

ఇప్పుడు రత్నకిరీటం మంజులద్వీపంలో చిక్కుకొన్నట్టు చారులద్వారా పొరుగు ద్వీపాల రాజులందరకూ వెల్లడైంది. అందులో ఒకరాజు, కిరీటాన్ని కాజేయాలనే ఆశతో తపోవర్ధనుడిపైకి దండెతుదా మనుకున్నాడు. ఈ వార్త తెలియగానే, మహీపాలుని మనస్సు పరిపరివిధాల పోయింది.

"నాకు గండం తప్పించటానికని మా తల్లి నన్ను ఇక్కడ చేర్చింది. ఈ ద్వీపాన్ని ఏలే తపోవర్ధన మహారాజు చేతులలో నన్ను పెట్టింది. అలా వప్పగింత పెట్టినందుకు, మహారాజు నన్నెంతగానో ఆదరించాడు. అయినా, నాకదేమో మనశ్శాంతి లేకుండా పోతున్నది. ఎంత యోచించినా కారణం తెలియటంలేదు. వృద్ధుడైన నా తండ్రి భల్లాణ రాజ్యంలో ఎలా వున్నాడో? అంతర్ధానమైన నా తల్లి యేమయిందో? మధ్యని ఈ కిరీటం నా చేతులలో చిక్కుకునిపోయిందే? తీరా యిప్పుడు పొరుగు రాజుల దృష్టి దీనిమీద పడిందాయె! ఇందుకోసం యుద్ధానికికూడా వస్తారని తెలుస్తున్నది. నిజంగా యుద్ధమే జరిగితే జయాపజయాలు ఎవరు నిర్ణయించగలరు? కానీ. నా మాట ఏమైనప్పటికీ, ఈ రత్నకిరీటాన్ని వీలైనంత గుట్టుగా భద్రపరచటం నావిధి. ఇప్పుడున్న పరిస్థితులలో నే చేయగల పని ఇదే" అని నిశ్చయించుకొన్నాడు.

ఈ నిశ్చయంతో మహీపాలుడు ఒక దుర్గమారణ్యం ప్రవేశించాడు. నరుడి కంటబడని చోటున, ఒక చెట్టుమీద కొమ్మల సందున, అతిభద్రంగా రత్నకిరీటాన్ని దాచిపెట్టాడు.

అంతలో—

(ఇంకా వుంది)






శ్రీరంగపురంలో చిట్టివెంకప్ప ఒక గొల్ల వాడు. అతనే కాదు, ఆ వూరిలో చాలామంది గొల్లవాళ్లున్నారు. వాళ్లందరకూ పాలవర్త కమే జీవనోపాధి. అందుచేత, ఒక్కొక్క ళ్లకు బోలెడన్ని పాడిపశువులు ఉండేవి.

ఆ పాలవాళ్ళందరూ బాగా ధనవంతులై, మంచి అభివృద్ధిలో ఉంటూవచ్చారు. వాళ్ల అభివృద్ధికి ముఖ్యమైన కారణం ఒకటి ఉన్నది. వీలైనంతవరకూ వాళ్లు పాలలో నీళ్లుకలిపి అమ్మేవాళ్లు. పైగా, ఎవళ్లయినా అడిగితే, నీళ్లు కలపలేదని అబద్ధం చెప్పే వాళ్ళు. ఊళ్ళో అందరూ ఇలానే చేస్తూ వుంటే, కొనుక్కునేవాళ్ళుమట్టుకు ఏం చెయ్యగలరు? వేరే దారిలేక, ఆ నీళ్ళ పాలతోనే తృప్తిపడి ఊరుకొనేవాళ్ళు.

చిట్టివెంకప్పకుకూడా ఒక అవు వున్నది. అది పూటకి రెండుశేర్ల పాలిస్తుంది. పాలలో నీళ్ళు కలపటానికిగాని, కలపలేదని అబద్ధం ఆడటానికిగాని, వెంకప్పకు ఇష్టంలేదు. అందుచేత పొదుగులో పాలు, పితికినవి పితికినట్టుగానే అమ్మివేసేవాడు. ఇందుకు చాలామంది సంతోషించేవారు.

తక్కిన పాలవాళ్ళకుమల్లే అతను మోసం చేయక, అబద్ధం ఆడక పాలు అమ్మితే, కొద్దిరోజులకల్లా వెంకప్ప నష్టపడ వలసివచ్చింది. ఏమి?— పాలవాళ్లంతా శేరు పాలకి శేరు నీళ్ళు ఎక్కించి, అమ్ముతారు. వెంకప్ప అమ్మే పాలు ఎంత నికరమైనవయినా, నాణ్యం తెలిసినవాళ్ళు శేరుకి ఒక్క అణాడబ్బులకంటే ఎక్కువ ఇచ్చేవారు కారు. అంతే. అనగా, వెంకప్ప అవు రోజూ రెండుపూటలా ఇచ్చే నాలుగు శేర్లపాలకూ మొత్తం నాలుగణాలుమాత్రమే ఎక్కువ వస్తుందన్నమాట.

సగానికి సగం నీళ్ళుకలిపి విక్రయించే పాలవాళ్ళ లాభాలముందు ఇది ఏపాటి?

పాలంకి వెంకటరామచంద్రమూర్తి




నిజానికి, వెంకప్ప లెక్క చూచుకొంటే, పాలు అమ్మగా వచ్చే ఆదాయం, ఆవులకుపెట్టే దానా విలువకుకూడా సరిపోయేది కాదు.

అవతల చూడబోతే—ఊరిలో పాలవాళ్ల ఆడంగులందరూ ఏడు వారాల నగలూ చేయించి, వంటినిండా అలంకరించుకొంటున్నారు. నిరుడు పూరిగుడిసెలుగా కనబడిన వాళ్ళ ఇళ్ళకు బదులుగా ఈ యేడు పెంకుటిళ్లూ, మిద్దెలూ లేచిపోయినై. ఎన్నాళ్లు పాలు అమ్మినా, వెంకప్ప స్థితిగతులలో ఎదుగూ బొదుగూ కనిపించలేదు.

ఈస్థితి తలుచుకుంటే వెంకప్ప భార్యకు గుండె బేజారైపోయింది. తోటి ఇల్లాళ్ళంతా వైభవంగా వెలిగిపోతూవుండటం, వాళ్ళ ముందు తను ఎప్పటిలాగా చింకిపాతలతోనే కాలక్షేపం చేయవలసిరావటం తలవంపులుగా తోచింది.

ఈ విచారంతో ఆమె భర్తను పిలిచి, "మనంకూడా పాలల్లో నీళ్ళు కలపకపోతే, మన సంసారం ఇక యెప్పుడూ నీళ్ళుకారుతూనే వుంటుంది. కనుక, ఇవ్వాళనుంచీ నీళ్ళుకలిపి పట్టుకెళ్ళకపోతే ఊరుకోను" అని ఆమె మొరాయించింది.

ఆడది గట్టిగా పట్టుపడితే మగవాడు ఏం చెయ్యగలుగుతాడు? "నీళ్లు కలపమంటే కలుపుతాను. కాని, పాలు పుచ్చుకొనేవాళ్లు అడిగితే 'కలపలేదు' అని అబద్ధంమాత్రం చెప్పలేను!" అన్నాడు వెంకప్ప.

భర్త మనస్సు గ్రహించింది, వెంకప్ప భార్య. "సరే, నువు అబద్ధం చెప్పక్కర్లేదు. నేను చెప్పినట్లు చెయ్యి. అప్పుడు తక్కిన అందరిలాగా మనకుకూడా మంచి లాభాలు వస్తయి" అంటూ, ఏవో ఆలోచనచెప్పింది. అది అతనికి నచ్చింది.

మరునాడు పొద్దున్నే వెంకప్ప నామాలు దట్టంగా పెట్టుకుని, పాలు పోయటానికని ఊళ్ళోకి బయల్దేరాడు. రోజూలాగా పాలు

చిక్కగా లేకపోవటం చూచి, అతను వాడుకగా పోసే ఇళ్ళల్లో యిల్లాళ్ళందరూ వెంకప్పను నిలవేసి అడగనారంభించారు:

"ఎప్పుడూ లేదు, వెంకప్పా! ఇవాళ నీకూ దుర్బుద్ధి పుట్టిందేం? పాలల్లో నీళ్ళు కలిపి తెచ్చావేం? ఇదేనా నీ నిజాయితీ?" అని వరసన వాళ్ళు అందరూ అడిగితే వెంకప్ప "ఒట్టు తల్లీ!—నేను పాలల్లో నీళ్ళు కలపనేలేదు" అని చెప్పాడు.

అందుకు వాళ్లు "పైగా అబద్ధాలుకూడా నేర్చావూ?" అని గద్దించేసరికి, "లేదు తల్లీ! నమ్మండి. నామాట అబద్ధంకాదు. నేను పాలల్లో నీళ్లు కలపలేదు!" అని మళ్ళీ అదేమాటగా చెప్పాడు.

చివరకు నలుగురూ పోగయి "ఏమిటయ్యా, వట్టి నీళ్లు ఎదట కనబడుతూవుంటే, లేదని బుకాయిస్తావేమిటి?' అంటూ కోపగించారు. అప్పుడు వెంకప్ప "నమ్మకం లేకపోతే, మా ఆడవాళ్లని పిలిపించి అడగండి. అదే కుంచెడుగిన్నె తెచ్చింది. నేను నీళ్ళు కలపలేదంటే నమ్మరేం కర్మం!" అన్నాడు అమాయకంగా.

ఇదేమిటా అని ఆరా తీసి, తరచి తరచి అడిగేసరికి, వెంకప్ప అసలు సంగతి




కాస్తా బయటపెట్టేకాడు. భార్య కుంచెడు గిన్నెలో నీళ్ళు పట్టుకొస్తే వెంకప్ప తను పితికిన రెండుశేర్ల పాలూ అందులో పోశాడట! ఇదీ ఆమె ఆనాడు చెప్పిన వుపాయం.

అనగా—ఏమైనా సరే, భర్త అబద్ధం ఆడడని వెంకప్పభార్య రూఢి చేసుకుంది. అందువల్ల వుపాయంపన్ని భర్త అబద్ధం చెప్పవలసిన అవసరం లేకుండా చేసింది. అందుకనే వెంకప్పకుకూడా ఈ వుపాయం నచ్చింది. ఈ సంగతి తెలిసినతరువాత, అంతా పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వుకున్నారు గాని, వెంకప్ప నిజాయితీనిమాత్రం ఎవరూ శంకించలేకపోయారు.

# నలుమూలల నడకలు

అమెరికాదేశంలోని ఇద్దరు ఖగోళశాస్త్రజ్ఞులు ఇటీవల ఒక నక్షత్రాన్ని కనిపెట్టారు. దాని ఆకృతి భూగోళంలో మూడవవంతు మాత్రమే వుంటుంది. ఆ నక్షత్రంతో ఒక చిత్రమైన ద్రవ్యం నిర్మితమైనది. ఆ ద్రవ్యం బరువు వర్ణించటానికి తరంకానిది. ఒక చిన్న అగ్గిపెట్టెలో ఆ ద్రవ్యం యిమిడ్చినట్టయితే, అది వెయ్యి టన్నుల బరువు తూగుతుంది!

ఇటువంటి చిత్రమైన ఆ నక్షత్రం వాతావరణం ఎంతో లేదట. దాని ఆకర్షణ శక్తి భూమికిగల శక్తికంటె 4,00,000,000 రెట్లు ఎక్కువ వుంటున్నది. దీనిని బట్టి, భూగోళంమీద 150 పౌన్లు తూగే మనిషి ఇప్పుడీ కొత్త నక్షత్రంపైన నించుంటే, కొన్ని వేల టన్నుల బరువు తూగుతాడన్నమాట!

*　　*　　*　　*

నాలుగుపందల సంవత్సరాలకిందట దుస్తుల తీరులనుగురించి ఒక పరిశోధకుడు పరిశ్రమచేసి, ఆ నాడు జేబులనేవి అసలు లేనేలేవని కనుగొన్నాడు.

అనాటికి జేబు అంటే యేమిటో మానవునకు తెలియదు. ఈ కారణంగా 17-వ శతాబ్దివరకూ సరకులనూ ధనాన్నీ జనం సంచీలలోనే మోసుకపోతూ వుండేవారు.

ఈ రోజులలో బిడ్డలకు జేబుకర్చుకుగాను పెద్దవాళ్ళు డబ్బులిస్తారు. జేబులంటేనే తెలియని ఆ కాలంలో జేబుకర్చుకు డబ్బివ్వడమేమిటి?

*　　*　　*　　*

బ్రిటిష్ అసోసియేషన్ తేనెటీగల పరిశోధకశాఖకు అధిపతి ఐన డాక్టర్. సి. జి. బట్లర్ అక్కడి శాస్త్రజ్ఞులందరకూ ఒక విచిత్రమైన విషయాన్ని వెల్లడిపరచాడు: విమానదాడినుండి మనం తప్పించుకొని రక్షణ పొందటానికి ఎటువంటి సాధనాలున్నయో, అలానే తేనెటీగలలోకూడా కొన్ని పద్ధతులున్నవట.

శత్రుఈగలు దాడిచేసి తేనె దొంగిలించటానికి వస్తుంటాయి. వీటి రాకను కనిపెట్టటానికని తేనెతుట్టెవద్ద ఈగలు కొన్ని కాపలాకాస్తాయి. ఐతే, తుట్టెలోవుండే ఈగలు అస్తమానం కాపలాకాస్తూ కూర్చోవు. శత్రుఈగలు దాడిచేయ వచ్చినప్పుడుకాని, ఇతర తుట్టెలనుండి చెదిరిపోయిన ఈగలు తమపైకి వస్తున్నప్పుడు కాని, తేనెటీగలకు అలికిడి తెలుస్తుంది. అటువంటి హెచ్చరిక వచ్చిరావటంతోనే తుట్టెలోపల వుండే తేనెటీగలు బయటకువచ్చి, తమ గృహాన్ని రక్షించుకొనటానికి పూనుకొంటాయి. అంతవరకు అవి గూళ్ళలో నిశ్చింతగా వుంటాయి.




మద్రాసు, త్యాగరాయనగరులో రత్నం. సీతాపతి, అని యిద్దరు తెలుగు కుర్రవాళ్లు ఉండేవాళ్లు. వాళ్లిద్దరూ ఒకే వీథివాళ్ళు, ఇరుగు పొరుగు యిళ్ళవాళ్ళు. చిన్నప్పటి నుంచీ ప్రాణస్నేహితులుగా పెరిగారు.

ఇద్దరూ ఒకేస్కూల్లో, తరువాత ఒకే కాలేజీలో చదివారు. ఇద్దరూ చదివిన చదువులుకూడా ఒకటే. ఒకేరకం దుస్తులు వేసేవారు; అందుచేత, చూచేవారందరూ ఈ యిద్దరకూ ఏ విషయంలోనూ భేదమే లేదని అనుకొనేవారు. దానికి తగినట్టు వాళ్ళిద్దరూ ఎప్పుడూ జంట విడిపోయేవాళ్ళుకాదు.

ఇద్దరూ మంచిబుద్ధులు కలిగి, పెద్దవాళ్ళవుతున్నకొద్దీ నలుగురిమధ్యనీ తలలో నాలుకలా మసులుకొనేవారు.

చదువులు పూర్తి అయిన తరువాత, కాస్తో కూస్తో ఆస్తులు ఉండటంమూలాన ఉద్యోగాలకోసం దేబిరించవలసిన అగత్యం ఇద్దరికీ లేకపోయింది. సుఖంగా ఇంటిపట్టునే కాలక్షేపం చేయసాగారు. ఇద్దరూ ఒకేసారి చేసుకుందా మనుకొన్నారో, ఏమో, ఇంకా ఒక్కరికీ వివాహంకాలేదు. ఈలోగా సీతాపతి తండ్రిగారు పోవటంమూలాన, ఇన్నాళ్ళనుంచి పెత్తనం చేస్తున రత్నం మేనమామగారు స్వగ్రామం వెళ్ళిపోవటం మూలాన, ఇద్దరూ ఒకేసారి ఇంటి వ్యవహారాలు చూసుకోవలసి వచ్చింది. ఇలా జీవితంలో ఎన్ని మార్పులు వచ్చినప్పటికీ వాళ్ల స్నేహంలో మట్టుకు ఎంతమాత్రమూ మార్పు రాలేదు.

వీరిద్దరినిచూచిన జనులందరూ అబ్బురపడేవారు. ఇద్దరూ చక్కనివాళ్ళే. తిండికీ, బట్టకూ లోటులేనివాళ్ళే, బుద్ధిమంతులే, చదువున్నవాళ్ళే. పైగా వీరిద్దరి అపూర్వ స్నేహం చూచినవారందరికీ ఎంతో ముచ్చట గొలిపేది.

వి. నారాయణమ్మ



ఆటువంటిది ఒకనాడు ప్రాణస్నేహితులైన ఆ యిద్దరకూ నడివీధిలో ఏదో విషయంలో అభిప్రాయభేదం కలిగింది. ఇద్దరూ పెద్దగా పోట్లాడుకున్నారు. చుట్టుపట్ల నిలబడి విన్నవాళ్ళందరికీ ఇది చాలా ఆశ్చర్యం కలిగించింది. అలాంటిది జరుగుతుందని వాళ్ళెన్నడూ అనుకోలేదు. రత్నం, సీతాపతిని తూలనాడటం వాళ్ళంతా నోళ్ళు తెరుచుకొని విన్నారు. "అబ్బాయీ!—నీలో మానవత్వం నశించింది. నీవంటివాళ్ళు ఎంత తొందరగా చస్తే, భూభారం అంత తొందరగా తగ్గుతుంది" అని రత్నం ఆవేశంతో నాలుగుమాటలూ అనేశాడు.

రత్నం తనను ఇవన్నీ ఎందుకు అంటున్నాడో సీతాపతికి తెలుసు. కాని అసలు సంగతి తెలియని జనులు రత్నం తన స్నేహితుణ్ణి ఇంత కఠినంగా మాట్లాడడం విని తెల్లబోయారు. వాళ్ల చెవులను వాళ్లే నమ్మలేకపోయారు.

తమచుట్టూ జనం గుమిగూడటం చూచి ఖిన్నులై, ఇద్దరు స్నేహితులూ యెడముఖం పెడముఖంగా వెళ్ళిపోయారు.

ఈ ఘర్షణ జరిగిన తరువాత రెండు మూడు రోజులదాకా స్నేహితు లిద్దరూ ఎక్కడా కలిసి తిరగలేదు. ఇంకా అప్పుడప్పుడూ, రత్నం బజారులో కనిపించేవాడు కాని సీతాపతి అసలు కనుపించేవాడే కాదు. చుట్టుపట్ల వీధుల్లోని జనమంతా ఈ తగాదాని గురించి గుసగుసలాడుకొన్నారన్న మాటేగాని అసలు కారణం ఎవరికీ తెలియలేదు.

చాలామంది చాలా రకాలుగా వూహించారు గాని నిజమేమిటో ఎవరికీ అంతు చిక్కనేలేదు.

ఈ ఘర్షణ జరిగిన నాల్గవరోజు ఉదయం సీతాపతిగారింట్లో రోజూ ప్రొద్దున్నే పని చేయటానికి వచ్చేదాసీది కెవ్వుమని ఒక

పెద్ద కేకపెట్టింది. రత్నంతోసహా చుట్టుపట్ల ఇళ్ళ జనమంతా పరుగెత్తుకొని వచ్చారు. చూస్తే ఏముంది? సీతాపతి కింద పడి వున్నాడు! నేలంతా నెత్తురు మడుగుకట్టి వున్నది! అతని గుండెలో ఒక బాకు గుచ్చుకుని వున్నది!




అందరూ హడలిపొయ్యారు. రత్నం వెంటనే పోలీసులకు కబురు చేశాడు. పోలీసులొచ్చి దరియాప్తుచేశారు. ఎవరూ వచ్చిపోయిన జాడలుకూడా లేవు. కిటికీ తలుపులుమట్టుకు తీసివున్నాయి. ఎవరిని అడిగినా మాకేం తెలియదంటే మాకేం తెలియదన్నారు. ఆరోజున రత్నం, సీతాపతి పోట్లాడుకోవటం విన్నవాళ్ళు మాత్రం, ఆ విషయం పోలీసులకు చెప్పేశారు. పోలీసులు ఆచూకీ తీయగా సీతాపతికి ఇంకెవరూ శత్రువులు లేనట్టు తేలింది. దానినిబట్టి వారికి రత్నంమీద గట్టి అనుమానం కలిగింది. ప్రాణస్నేహితుల్లో తగాదాలు వస్తే అవి ఎంత ప్రమాదంగా వుంటాయో, అందరికీ తెలుసుగదా?

రత్నాన్ని అడిగారు పోలీసులు. తామిద్దరకీ చిన్నప్పటినుంచీ స్నేహమనీ, కాని ఆరోజున పోట్లాడుకున్నమాట నిజమేననీ, రత్నం ఒప్పుకొన్నాడు, 'పోట్లాట ఎందువల్ల వచ్చింది" అని అడిగితే చెప్పనన్నాడు.

దానివల్ల పోలీసులకు అతనిమీద ఇంకా అనుమానం ఎక్కువైంది. కాని అతడే సీతాపతిని హత్యచేశాడనటానికి రుజువు ఏమీ లేకపోవటంవల్ల అరెస్టుచేయలేదు. మొత్తానికి ఆపేటంతా పుకారులతో మారుమోగిపోయింది. రేపో మాపో పోలీసులు రత్నాన్ని తప్పకుండా అరెస్టుచేస్తారని అందరూ చెప్పుకొంటున్నారు.

పాపం, రత్నం లోకంలో అల్లుకున్న వదంతికి చాలా బాధపడుతున్నాడు.

ఇలా వుండగా—

ఒకరోజున ఆపేటలోని పిల్లలందరూ పండువెన్నెల్లో ఉత్సాహంగా గుడిదగ్గర ఆటలాడుకొంటున్నారు. కొంతమంది పెంకెవాళ్ళు గుడి గోపురానికంటా ఎక్కి, గూళ్ళల్లో చేతులుపెడుతున్నారు. పావురాయి పిట్టలు బెదిరి, పారిపోతున్నాయి.

ఇంతలో ఒక పిల్లవానికి గూటిలో ఒక కాగితం దొరికింది. అది వాడికి అర్థంకాక పరుగెత్తి పట్టుకుపోయి, తన తండ్రికి చూపించాడు. అదే సీతాపతి వ్రాసినజాబు. అందులో—

'నేనొక దుర్వ్యసనానికి అలవాటుపడ్డాను. ఎన్నిరకాల ప్రయత్నించినా దాన్నుంచి తప్పుకోలేకపోయాను. నా ఆస్తి అంతా జూదంలో తగలేశాను. ఇది యెవరికీ తెలియదు. అప్పులు తీర్చేస్తే ఇవ్వాళ నాకేమీ మిగలదు. నా ప్రాణస్నేహితుడు రత్నం నాకు అనేకవిధాల చెప్పిచూశాడు. చివరకు ఒకరోజున కఠినంగా మందలించాడుకూడా. నాకు చాలా సిగ్గువేసింది. కాని ఏంచేసేది? ఈ దుస్థితి సహించలేకపోయాను. అందుకే ఈలోకం వదిలి పోతున్నాను. రత్నం నన్ను క్షమిస్తాడని ఆశిస్తున్నాను.'

ఈ ఉత్తరంసంగతి క్షణంలో పేటంతా అలుముకొంది. ఉత్తరం దొరికిన కుర్రవాని తండ్రి దాన్ని పోలీసులకు అందజేశాడు. అది సీతాపతి దస్తూరేనని రుజువయ్యింది. అతను ఆత్మహత్య చేసుకొన్నాడని తేలిపోయింది.

రత్నాన్ని గురించి అనవసరంగా అపోహ పడ్డందుకు జనమంతా సిగ్గుచెందారు.

సీతాపతి ఆత్మహత్య చేసుకోకముందే ఒక జాబురాసి పక్కన పెట్టాడని, తరువాత ఒక పావురాయి ఆ జాబు ఎత్తుకెళ్ళి గూట్లో దాచుకొందనీ, అందరికీ అర్థమయింది.

ఈవిధంగా పక్షి దాచిన జాబు ఒకవ్యక్తి ప్రాణాన్ని రక్షించింది.



# చెప్పుకోగలవా?

### 1. గడియారం పన్నెండు కొట్టింది :

ఒక అబ్బాయీ, అతని చెల్లెలూ, ఒక గడియారపు స్తంభందగ్గర నిలబడ్డారు. అప్పుడే గడియారం 6 కొట్టింది. ఆ అబ్బాయి తన చేతిగడియారం చూచుకుంటూ '6 కొట్టటానికి 30 సెకెన్లు పట్టింద'ని అన్నాడు. 'ఐతే, 12 కొట్టటానికి ఎంతకాలం పడుతుంది?' అని చెల్లెలు ప్రశ్నించింది. '60 సెకన్లు' అని అబ్బాయి వెంటనే బదులుచెప్పాడు. కాని 'ఆ మాట తప్పు' అని అంటూ చెల్లెలు సరైన సమాధానం చెప్పింది. అదేమిటో నువు చెప్పుకోగలవా?

### 2. పాల కొలత :

ఒకామె 4 గిద్దలు పాలు తెమ్మని పాలవాడికి చెప్పింది. వాడు 8 గిద్దలు పట్టే గిన్నెలో పాలు తెచ్చాడు. కాని కొలుద్దామంటే వానివద్ద గిద్దలేదు. పాలు తెమ్మన్న ఆవిడదగ్గిర రెండు పాత్రలున్నాయి. ఒకదాంట్లో 5 గిద్దలూ, రెండవ దాంట్లో 3 గిద్దలూ పట్టుతై. ఇవిచూచి పాలవాడు 'నాలుగు, నాలుగు గిద్దలు కొలవటం ఎలాగా?' అన్నాడు. అప్పుడు ఇంటావిడ కొడుకు 4 గిద్దలు ఎలా కొలవ వచ్చునో పాలవాడికి చెప్పాడు. ఆ ఉపాయం నువు చెప్పుకోగలవా?

### 3. బుట్టలో మామిడిపళ్ళు :

12 గురు పిల్లలున్నారు. వాళ్ళమధ్య ఒక బుట్టలో 12 మామిడిపళ్లున్నాయి. ఒక్కొక్కడు ఒక్కొక్క పండు తీసుకొన్నాడు. ఐనా, బుట్టలో ఇంకా ఒక పండు మిగిలివున్నది. అది ఎలా మిగిలిందో చెప్పుకోగలవా?

### 4. దొంగ : దొర

ఒక దొంగ గడ్డి ఎత్తుకపోదామని వచ్చాడు. వాడిని చూచాడు యజమాని. దొంగా యజమానిని చూచాడు, కాని తప్పించుకుపోలేక గడ్డివాముచుట్టూ తిరగటం మొదలుపెట్టాడు. వాడిని వెంబడించాడు యజమాని. ఇద్దరు ఎదురుగా వున్న రెండు చివరలనుంచీ పరుగెత్తసాగారు.

ఒకచుట్టు తిరిగిరావటానికి దొంగకు 40 సెకన్లు పట్టింది. యజమానికి 30 సెకన్లుమాత్రమే పట్టింది. ఇలా ఎన్నిచుట్లు తిరిగేటప్పటికి, యజమాని దొంగను పట్టుకోగలడో, చెప్పగలవా?

[చెప్పుకోలేకపోతే వచ్చేసంచిక చూడు]




అనేకవందల ఏళ్ల క్రితం అరావళీ పర్వత ప్రాంతంలో ఒక కొండమీద రాతిలో, ఎవరో మహాశిల్పి మలిచినట్టుగా, ఒక మనిషి ముఖంయొక్క ఆకృతి ఉండేది. నిజానికి అది ఏశిల్పీ మలిచినది కాదు. ఆ ముఖాకృతి ప్రకృతిసిద్ధంగానే ఏర్పడింది. ఆ చుట్టుపక్కల అనేక గ్రామాలవారికి రోజూ ఆముఖం కనిపిస్తూవుండేది. వారు అందులో ఔదార్యమూ, కరుణా, శాంతమూ, దయా మొదలైన ఉన్నతభావాలు చూడగలిగేవారు. ఆ ముఖంయొక్క ఫాలభాగం విశాలంగా వుండి, జ్ఞానాన్ని సూచించేది. కన్నులు ప్రజలకేసి దయగా, వాత్సల్యంతో చూస్తున్నట్టుండేవి.

ఈ రాతిలోని ముఖాన్నిగురించి అనేక రకాల కథలను ప్రజలు చెప్పుకొనేవారు. అదే పోలికగల మహనీయుడొకడు వెనక ఎప్పుడో వుండేవాడనీ, అతని దయవల్ల ప్రజలు ఎంతో సుఖపడ్డారనీ కొందరు చెప్పుకొనేవారు. కొంత కాలం క్రితం ఆ ప్రాంతాలకు ఒక మునీశ్వరుడు వచ్చాడు. చుట్టుప్రక్కల గ్రామాలవారు వందలాదిగా మునీశ్వరుణ్ణి చూడబోయారు. వారిలో కొందరు ఆ రాతిలోని ముఖంగురించి మునీశ్వరుణ్ణి అడిగారు. ఆ మునీశ్వరుడు కొంచెంసేపు ఆ ముఖంకేసి చూసి, "అదే పోలికగలవాడు ఈ ప్రాంతాల కనిపిస్తాడు. అతను గొప్పజ్ఞాని, మహనీయుడు. అతనివల్ల ప్రజలకు అంతులేని ఉపకారాలు జరుగుతవి" అన్నాడు.

ఆనాటినుండీ ఆ చుట్టుపట్ల గ్రామాలవారు తమ గ్రామాలకు ఏ కొత్తవ్యక్తి వచ్చినా ముఖంకేసి పరీక్షగా చూసేవారు. కాని రాతిలోని ముఖంవంటి పోలికగలవాళ్లు ఒకరూ అక్కడకు రానేలేదు.

ఈవిధంగా అనేక దశాబ్దాలు గడిచి

కొడవటిగంటి కుటుంబరావు

పోయినయి. మునీశ్వరుడు చెప్పిన వృత్తాంతాన్ని ఒకతరంవారు మరొకతరంవారికి కట్టుకథకింద చెప్పుకొంటూవచ్చారు. చాలా మందికి ఆ కథలో విశ్వాసంకూడా పోయింది.

కాని విశ్వాసం పోనివారిలో ఒక కుర్రవాడుండేవాడు. వాడిపేరు వసువు. వసువు పసివాడై ఉన్నప్పుడే వాడితాత వాణ్ణి రోజూ ఒళ్ళో కూచోబెట్టుకుని రాతిలోని బొమ్మ చూపిస్తూ మునీశ్వరుడు తన చిన్నతనంలో చెప్పినమాటలను తన మనవడికి చెప్పేవాడు. అనేక సంవత్సరాలపాటు రోజూ ఈ విషయం వినివుండటంవల్ల మునీశ్వరుడు చెప్పిన జోస్యం వసువుతలకు బాగా పట్టింది. తాను చూస్తూండగానే ఈ జోస్యం ఫలిస్తుందని వసువుకు గట్టినమ్మకం వుండేది.

ఇట్లా ఉంటూవుండగా, వసువు ఉండే గ్రామానికి ఒక రోజున మహాజ్ఞాని అయిన సన్యాసి ఒకడు వచ్చాడు. ఆయన వేదాలనూ, ఉపనిషత్తులనూ బాగా కాచి వడబోసినవాడనీ, తర్క వ్యాకరణాది శాస్త్రాలలో ఘటికుడనీ అన్నారు. అటువంటి మహనీయుడి రాకవల్ల ప్రజలకు తప్పక మేలు చేకూరుతుందనీ, ఆయనద్వారా మునీశ్వరుడి వాక్కులు ఫలించవచ్చుననీ ఆశపడి




చిన్నవాడైన వసువు సన్యాసిని చూడబోయినాడు.

ఈ సన్యాసిముఖం రాతిలోని బొమ్మకు పోలికే లేదు. అయినా నిరాశ చెందకుండా వసువు ఆయన చెప్పే గొప్పగొప్ప విషయాలన్నీ విన్నాడు. సన్యాసి చెప్పిన విషయాలు గొప్పవనటానికి సందేహంలేదు. కాని ఆయనకు ప్రజల జీవితమూ, వారి కష్టసుఖాలూ కొంచెమైనా తెలియవు. సామాన్య కుటుంబంలో పుట్టి ప్రజలతో నిత్యమూ కలిసి మెలిగే వసువుకు త్వరలోనే ఈ విషయం అర్థమయింది.




అదీకాక యీ సన్యాసి అమితకోపిష్టి. తాను ప్రబోధించేటప్పుడు ఎవరూ తుమ్మరాదు, దగ్గరాదు. అంత గొప్ప విషయాలు వినేటప్పుడు పామరులకు ఏదైనా ధర్మ సందేహం కలగదా? సందేహం కలిగి ప్రశ్న వెయ్యరాదు! "మీ కర్మ! యోగ్యత గల వారు అర్థంచేసుకోండి. లేనివారు నోరు మూసుకోండి," అనేవాడు.

అంతకంతకూ ప్రజలకు సన్యాసిమీద భక్తి తగ్గింది. కొంతకాలానికి సన్యాసి వెళ్ళి పోయాడు. తన ఆశ ఫలించనందుకు వసువు నిట్టూర్చాడు.

కొంతకాలం జరిగింది. ఆ ప్రాంతాలకు మహా శౌర్య పరాక్రమవిక్రము డొకాయన వేంచేశాడు. ఆయన అనేక యుద్ధాలలో గెలిచిన వీరుడు. ఆయన ఉన్నచోట శత్రు భయం ఉండదనీ, ప్రజలు నిశ్చింతగా గుండెలమీద చేయివేసుకు నిద్రపోవచ్చు ననీ అన్నారు. మునీశ్వరుడు చెప్పినమనిషి ఈ యోధుడే అయివుంటాడని వసువు ఆశ పడి వెళ్ళి చూశాడు. కాని ఈ వీరుడి ముఖం రాతిలోని ముఖాన్ని బొత్తిగా పోలివుండ లేదు.

పైగా ఈ వీరాగ్రేసరుడు ప్రజల కష్ట సుఖాలు ఎరిగినవాడు కాడు. వారి యోగ క్షేమాలయందు ఆసక్తికలవాడు కాడు. తమతమ పనులలో నిమగ్నులైవుండే మనుష్యులను వేళకానివేళ పిలిపించి వారి పనులు పాడుచేసేవాడు. తనమాట వినని వారిని హింసించేవాడు. మహావీరుడని తనకు భక్తితో పరిచర్యలను చేసినవారిని పశువులకంటె హీనంగా చూసేవాడు. క్రమంగా ప్రజలకు ఆయనమీద గౌరవం పోయింది. కొద్దికాలానికి ఆయనా మరొక ప్రాంతానికి వెళ్ళిపోయాడు. వసువు మరొక సారి నిట్టూర్చాడు.




మరికొంతకాలం గడిచింది. ఆ ప్రాంతాలకు గొప్ప వణిక్పుంగవుడు వస్తున్నట్టు తెలిసింది. ఈయన సముద్రాలమీద నావలను పంపి పెద్దయెత్తున వ్యాపారంచేసి కోట్లు గడించాడట. ఆయన రెండురోజులు నిలిచినచోట భోగభాగ్యాలూ, సిరిసంపదలూ, తాండవిస్తాయట.

ఇక్కడివారంతా కష్టజీవులనీ, తమ గ్రామాలలో సిరిసంపదలు తక్కువనీ వసువు ఎరుగును. ఈ వర్తకుడు తమను ఉద్ధరించటానికి వస్తున్నాడనీ, ఈయన ముఖం రాతిలోని ముఖాన్ని పోలివుంటుందనీ వసువు చాలా ఆశపడ్డాడు.

కాని తీరాచూస్తే వర్తకుడి ముఖం మరొకవిధంగా వుంది. అయినా ఈయన రాకవల్ల సిరిసంపదలు పెరిగేటట్టే కనిపించాయి. ఆయన పొలాలలో కొత్త పంటలు వేయించాడు. ఆ పంటలు తానే కొన్నాడు. రైతులకు పాతపంటలకన్న ఈ కొత్త పంటలు ఎక్కువ లాభించాయి. అందరి దగ్గిరా ఎక్కువడబ్బు మెసలసాగింది. వృత్తులవారిలోకూడా పూర్వం ఎరగని వృత్తులను కోటీశ్వరుడు ప్రోత్సహించాడు. ఒకటి రెండేళ్లయిన తరువాత కోటీశ్వరుడు కొత్త పంటల ధరలు తగ్గించాడు. కొత్తవస్తువుల ధరలుకూడా తగ్గించాడు. ఆ పంటలూ, ఆ వస్తువులూ తమకు పనికొచ్చేవికావు గనక కోటీశ్వరుడు నిర్ణయించిన ధరకు ప్రజలు ఒప్పుకోవలిసివచ్చింది. లేకపోతే కొనేవారే లేరు!

అదీగాక ప్రజలు తినే ఆహారపదార్థాలూ, నిత్యమూ వాడుకునే వస్తువులూ కరువు కాసాగినై. వాటి ధరలు పెరగసాగాయి. ప్రజల జీవితంలో సంక్షోభం బయలుదేరింది. అదివరకు హాయిగా జీవిస్తున్నవారు కొందరు నిరుపేదలైపోయారు.




తిండి కాటకమూ, డబ్బు కాటకమూకూడా వచ్చిపడింది. కోటీశ్వరుడు తనకు కావలిసిన సరుకంతా సంచులు నింపుకొని, సంచులు బండ్లలో పేర్చుకుని, వచ్చిన దారినే వేంచేశాడు. ఇదంతా చూస్తున్న వసువుకు ప్రజలనుచూసి దుఃఖం వచ్చేసింది. వాడి వయసుతోబాటు బుద్ధికూడా వికసిస్తున్నది.

మరికొంతకాలం గడిచింది. ఆ ప్రాంతాలకు ఒక మహాకవి వచ్చాడు. ఆ కవి సామాన్యప్రజల జీవితం తెలిసినవాడు. సామాన్య ప్రజలనుగురించి గీతాలురాశాడు. ఆయన గీతాలకు దేశదేశాలా ఖ్యాతి లభించింది.

"ఈ కవిముఖం తప్పక రాతిలోని ముఖాన్ని పోలివుంటుంది. మహాముని వాక్కు వ్యర్థంకాదు" అనుకున్నాడు వసువు.

కవి వచ్చాడు. ఆయన ముఖంలో రాతిలోని ముఖం కవళికలేమీలేవు. కవి పాటలు పాడాడు. జనం ఆయనచుట్టూ మూగి ఆయన గీతాలువిని తన్మయులైనారు. ఆయన్ను దేవుడికన్న ఎక్కువగా చూశారు. ఆయనకు సకలోపచారాలూ చేశారు. కాని కవికి ప్రజలపట్ల నిజమైన ఔదార్యంలేదు; వారితో ఆయనకు నిజమైన సానుభూతి లేదు.

ఆయన తన గీతాలలో ప్రజల కృషిని పొగిడాడేగాని ఆ కృషిచూస్తే ఆయనకు గౌరవంలేదు. పనీ పాటలు చెయ్యనివారితోనూ, డబ్బు ఎక్కువ కలవారితోనూ ఆయన అన్యోన్యంగా ఉండేవాడు. పనిచేసేవారిని దూరంగా వుంచేవాడు. వారి ఇళ్లకు వెళ్ళేవాడు కాడు. వారిని దగ్గిరికి రానిచ్చేవాడు కాడు. వారి కష్టసుఖాలను శ్రద్ధతో వినేవాడు కాడు. ఆపదలో వారిని ఆదుకొనేవాడు కాడు.

"ఈ కవి వంచకుడు. ఆయన తన గీతాలతో ప్రజలను వంచిస్తున్నాడుగాని ప్రవర్తనతో కాదు. అందుచేత ఆయన ప్రవర్తన వాస్తవమైనది. ఆయన గీతాలు అసత్యమైనవి—వాటిలో ఎంత యదార్థం ఉంటేనేం?" అనుకున్నాడు వసువు.

ప్రజలు కవినైజం తెలుసుకుని ఆయన పట్ల ఆదరం చూపడం మానివేశారు. కవి కొంతకాలం వుండి ఎటో వెళ్లిపోయాడు.

వసువు విచారంగా రాతిలోని బొమ్మకేసి చూస్తూ నిలబడ్డాడు. తన తాతచెప్పిన మునీశ్వరుడి మాటలయందు విశ్వాసం చలించసాగింది.

ఎందరెందరో మహనీయులు తాను చూస్తుండగా వచ్చారు. ఒక్కరి ముఖంలోనూ ఆ బొమ్మలోఉండే ఔదార్యం, దయా, కరుణా, వాత్సల్యం కనబడలేదు. అందుకే ఒక్కరూ తన ప్రజలకు కొంచెమైనా ఉపకారం చెయ్యలేదు. వసువు ఈ విధంగా ఆలోచిస్తూనిలబడివుండగా కొందరు మనుష్యులు అదారినవస్తూ వసువుమొహంకేసి చూసి, ఆరాతిలోని ముఖంకేసి చూశారు. ఏమాశ్చర్యం! వసువు ముఖం మూడు మూర్తులా రాతిలోని ముఖంలాగే ఉంది!

ఈ వార్త క్షణంలో చుట్టుపక్కల గ్రామాలకు పాకింది. రాతిలోని ముఖం గురించీ, దాన్నిగురించి పూర్వులు చెప్పకొన్న గాథగురించి మరిచిపోయినవారంతా వసువుదగ్గిరికి వచ్చి మొట్టమొదటిసారిగా రెండుముఖాలకూ గల పోలికను చూసి ఆశ్చర్యపడసాగారు.

మునీశ్వరుడి అమోఘ వచనం ఫలించింది. వసువు అనేకమంది మహనీయుల దగ్గిర నేర్చుకున్న విషయాలు తనప్రజలకు ఉపయోగపడేటట్టు చేసి, ప్రజలలో ఒకడుగా ప్రజల కష్టసుఖాలు పంచుకుని, వారికి ఐశ్వర్యమూ, ఆనందమూ చేకూర్చి ధన్యజీవి అయినాడు.



# రామాయణ జన్మకథ



పాపాయిలూ!—ఈ 23-వ తారీఖున శ్రీరామనవమికదా? రామాయణకథ తెలియనివారెవరూ మనలో వుండరు. రామునికథ మొదట వ్రాసింది వాల్మీకి. అందుకనే ఆయనకు 'ఆదికవి' అని పేరువచ్చింది. వాల్మీకిఋషికి ఈ కథె వ్రాయాలని ఎందుకు బుద్ధిపుట్టిందో మీకు తెలుసా?—

వాల్మీకి ఏదైనా ఒక మహాకావ్యం వ్రాదామని అనుకొంటూవుండగా ఒకరోజున నారదులవారు వేంచేశారు. అప్పుడు వాల్మీకి తనకు కలిగిన సమస్యనుగురించి చెప్పగా నారదుడు—'లోకంలో రాముని మించిన సత్యవాది, గుణవంతుడు, బలవంతుడు, ధర్మపరుడు, దృఢవ్రతుడు, మరెవ్వరూలేరు. కనుక రాముని కథనే వ్రాయమ'ని సలహాచెప్పాడు.

మరునాడు వాల్మీకి అరణ్యమధ్యంనించి స్నానానికి వెళుతూవుండగా ఒక చెట్టుమీద కూర్చునివున్న క్రౌంచపక్షుల జంటలో ఒకదానిని, ఒక బోయవాడు కొట్టడం, అది చనిపోవటం, కంటబడింది.

ఇదిచూచి వాల్మీకికి చాలా ఆవేదన కలిగింది. అతని హృదయం తల్లడిల్లిపోయింది. జంటవిడిన పక్షులయెడ జాలి, దీనికి కారకుడైన బోయవాని ఎడ కోపమూ, రెండూ ఒకేసారి కలిగాయి.

వెంటనే, అప్రయత్నంగా ఆయన నోటినుండి బోయవాణ్ణి నిందిస్తూ ఒక శ్లోకం వెలువడింది. ఆ శ్లోకమే సంస్కృతభాషలో మొట్టమొదటిది.

అదేమో స్తరు శ్లోకాలతో వాల్మీకి తరువాత రామాయణకథ నంతటినీ పూర్తిగా రచించాడు.

ఆయన రచించిన రామాయణం మొత్తం 24,000 శ్లోకాలు కలిగివున్నది.

ఆ మహాకావ్యం తరువాత కవులందరికీ ఆదర్శప్రాయమయ్యింది.



# నేలను రాలిన పళ్లు

ఒక అడవిదగ్గర ఐదెకరాల తోట సాగు చేసుకుంటూ వీరయ్య కాలక్షేపం చేసే వాడు. భార్య పుల్లమ్మతో సహా తోటలోనే నివసిస్తూ ఉండేవాడు. ఆమె భర్తకు ఎంతో సహాయంగా వుంటూ వుండేది.

ఐతే, తోట వీరయ్యది కాదు. అక్కడికి నాలుగుమైళ్ళల్లో వున్న ఒక షావుకారుది. ఆ తోటలో రకరకాల చెట్లు ఉన్నవి. అన్ని కాలాల్లోనూ తోటలో యేదో ఒక పండు ఉండనే వుంటుంది. చెట్టున వున్న పళ్లను వీరయ్య ముట్టుకోకూడదని షరతు. గాలికి కింద రాలే పళ్ళుమాత్రమే వీరయ్యవి. అలా రాలిన పళ్ళను వీరయ్య అమ్ముకో వచ్చు. నాలుగేళ్లక్రితం గాలివానవచ్చి తోటలోని పళ్లన్నీ దులిపివేసింది. ఆ ఏడాది వీరయ్యకు బాగా లాభించింది.

కాని ఏటా గాలివాన రాదుకదా? తిండికి సరిపడె ఆదాయం రావటమే చాలా కష్టంగా వుంటూండేది. కనుక, పక్కని వున్న అడవిలో కట్టెలు కొట్టుకొని, వాటిని అమ్ముకొని జీవ యాత్ర సాగించేవాడు; భర్త అడవికి వెళ్లి నప్పుడు పుల్లమ్మ తోటపనిలో వుండేది.

చుట్టూ ప్రహరీ. మధ్యలో వీరయ్య గుడిసె. గుడిసెను అనుకొని పెద్ద గడ్డి వామి. రెండువెడ్ల సహాయంతో దిగుడు బావిలోని నీటితో అతను తోటను తడుపుతూ వుంటాడు.

తోటనే నమ్ముకొనివున్న వీరయ్యకు దాన్ని విడిచి వెళ్ళటానికి మనసు ఒప్పదు. ముసలితనంకూడా వొచ్చి పడుతోంది. తోట యజమానికా, తనమీద ఎంతో నమ్మకం. రెండు మూడు రోజులకు ఒకసారి వచ్చి,

జి. సుబ్బులక్ష్మి




తయారైన పళ్ళను కోయించి ఆయన అమ్మకానికి పంపేస్తూ ఉంటాడు.

ఒకనాడు వీరయ్య కట్టెలు కొట్టుకొని పల్లెలో అమ్ముకొని కొద్దికొద్దిగా వెచ్చాలు కొనుక్కున్నాడు. తిరిగి వొస్తూవుండగా ఎక్కడినుంచో ఉల్లిపాయల వేపుడువాసన ముక్కుకు కమ్మగా తగిలింది. ఉల్లిపాయలతో పప్పుపులుసు చేయించుకుందామని మనసు పుట్టి, అరవీసెడు ఉల్లిపాయలు కొనుక్కొని, వీరయ్య ఇంటిదారి పట్టాడు.

ఆలోచిస్తూ నడుస్తూన్న వీరయ్యకు ఎదురుగా ఒక భీకరాకారం కనిపించింది.

ఐతే, ఒక గజం దూరంలోకి వొచ్చాకకాని వీరయ్య అదేమిటో గుర్తించలేదు. అది ఒక పెద్ద ఎలుగుబంటి. రెండు కాళ్లమీదా నిలబడి, నోరుతెరచి కోరలు బైటపెట్టి వీరయ్యను పట్టుకోవటానికి సిద్ధంగా వుంది.

వీరయ్యకు పైప్రాణం పైనే పోయినంత పనైంది. వెనక్కు పరుగెత్తేందుకా వీల్లేదు. రక్షించుకునేందుకా చేతిలో ఏమీలేదు. ఎలాగూ చావు తప్పదు. ఐనా ఎలుగుబంటితో అన్నాడు—"నన్ను చంపితే నీకు ఇప్పుడు ఆకలి తీరవొచ్చు. కాని మళ్ళీ రేపు నీకేదన్నా దొరకాలికదా!"

"రేపటి సంగతి తరువాత చూచుకుందాం" అంది ఎలుగు.

"అదికాదు-ఇవాళా, రేపే కాదు-నీకు ఏనాడు ఆకలైనా, నీ ఆకలిని తీర్చేందుకు నేను సిద్ధంగా వుంటాను" అన్నాడు వీరయ్య.

"అంటే...?" అంది ఎలుగు.

"నీకు ఆకలైనప్పుడల్లా మా ఇంటికి రా. కడుపునిండా భోజనం పెడతాను" అన్నాడు.

ఎలుగు ఆలోచనలో పడింది.

చేతులోని సంచీ తెరిచి చూపిస్తూ—"చూడు...సరుకులు తీసుకొని వెళ్తున్నాను.

రాత్రికి ఉల్లిపాయల పప్పుపులుసు పెట్టిస్తాను..." అన్నాడు వీరయ్య.

ఉల్లిపాయ వాసన తగలగానే ఎలుగుకు నోరు ఊరింది.

"సరే...ఇప్పటికి వొదిలేస్తున్నా. కాని నాకు యేనాడైనా ఆహారం దొరక్కపోతే మాత్రం నిన్ను చంపుతాను. రాత్రికి మీ ఇంటికి వొస్తాను. ఎలా మర్యాదచేస్తావో? అన్నట్టు, మీ ఇల్లెక్కడా?" అంది ఎలుగు.

"అదుగో...ఆ తాటిచెట్టు వెనక వుందే తోట. అందులో—" అన్నాడు వీరయ్య.




చావు తప్పి కన్ను లొట్టపోయినంత పనయింది అతనికి. ఎలుగు ఇక రోజూ తన ఇంటికి తయారవకమానదే. ఎట్లా?

ఇంటికి వొచ్చి జరిగినదంతా భార్యకు చెప్పాడు. ఆమెమాత్రం యేమనగలదు? ప్రమాదం తప్పించుకునే దారి తోచలేదు.

ఏదెలా వున్నా, చిన్నకుండెడు ఉల్లిగడ్డల పప్పుపులుసు తయారైంది. ఎలుగు వొచ్చేదాకా ఆగేందుకు ప్రాణం వొప్పక ఇద్దరూ కూర్చుని అన్నంతిన్నారు. భోజనాలయాకచూస్తే పులుసూ మిగలలేదు; అన్నమూ మిగలలేదు.

వీరయ్య మళ్ళీ వొండమన్నాడు. కాని ఉల్లిపాయలేవీ? ఐనా కడుపునిండా తిన్నాక, మళ్ళీ పనిచేసేందుకు పుల్లమ్మ ఒళ్లొంగలేదు. ఎలుగు వొచ్చేసమయమైంది. ఇంటికి తాళాంవేసి వీరయ్యా, పుల్లమ్మా గడ్డివామిలో దాక్కొని, కిక్కురుమనకుండా అందులో కూర్చున్నారు.

ఐదారు నిమిషాలు గడిచేప్పటికల్లా తలుపు చప్పుడైంది. వీరయ్య ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని, ఊపిరిపీల్చిన చప్పుడు ఎక్కడ వినిపిస్తుందో అని మెల్లిగా గాలి పీలుస్తున్నాడు.

తలుపుదగ్గర శబ్దం ఎక్కువైంది. క్రమంగా ఇంకా పెద్దచప్పుడు ... బహుశా ఎలుగు వచ్చి గోడ దూకివుంటుంది. గుర్రుపెడుతూ, నేలను చప్పుడుచేస్తూ ఎలుగుబంటి గుడిసెను సమీపించింది. తలుపులు తాళంవేసి వుండటంచేత లోపల ఎవరూ లేరనుకుంది. ఐనా కోపంకొద్దీ తలుపులు బాదింది. తనను మోసం చేసినందుకు వీరయ్యపైన కసి తీర్చుకోవా లనుకొన్నది.

ఇక తోటలో పడింది. చెట్లకొమ్మలన్నీ ఇష్టానుసారంగా విరిచివేసింది. పువ్వు, పిందె లేకుండా రాల్చివేసింది. ఒక్క గంటకల్లా దానికి ఆయాసంవొచ్చింది. ఒకపక్క ఆకలి, మరొకపక్క కోపం. మళ్లీ దేవుడా అంటూ గుడిసెదగ్గరకు వచ్చింది.

ఎలుగు తమకు దగ్గరలోనే వున్నందున వీరయ్యకూ పుల్లమ్మకూ ముచ్చెమటలూ పోసినయి. ఐనా, మెదలలేదు.

గుడిసెతలుపులు మళ్లీ బాదింది ఎలుగు. అదే సమయంలో పుల్లమ్మ చాలాసేపటి నుంచీ ఆపుకొని ఒక్కతుమ్ము తుమ్మింది. ఎలుగు తమను కనుక్కొంటుందేమోనని వీరయ్య హడిలిపొయ్యాడు.

ఆ తుమ్మిన ధ్వని ఏదో తుపాకిపేలినట్టనిపించి, ఎలుగుబంటి హడిలిపోయి, కాళ్లకు బుద్ధిచెప్పింది...

తెల్లవారాకగాని వీరయ్యా పుల్లమ్మా గడ్డివామిలోంచి బయటకి రాలేదు. తోటలోకి పోయి చూస్తే అన్నీపళ్ళే! యజమానికూడా వొచ్చి చూశాడు. కథంతా విన్నాడు. యజమాని ఒప్పందంప్రకారం వీరయ్య ఆ పళ్లనన్నిటినీ అమ్ముకుని, లాభంపొంది సుఖించాడు. ఎలుగుచేసిన ఉపకారం అతను మరిచిపోలేదు. మళ్లీ అది ఆ ప్రాంతాలకు వస్తుందేమోనని చాలా కాలం ఎదురు చూచాడు. కాని, ఎన్నడూ అది రానేలేదు.



## బదులు చెప్పు

1. ప్రపంచంలోకల్లా పెద్ద నది ఏది?
   - అమెజాన్
   - మిసిసిపి
   - నైల్
2. భారతదేశంమీద మొట్టమొదటగా దండెత్తిన మహమ్మదీయుడెవడు?
   - బిన్‌కాశిమ్
   - మహమ్మద్ గజనీ
   - గోరీ
3. అన్నిటికంటె యెత్తయిన జంతువు ఏది?
   - ఒంటె
   - ఏనుగ
   - జిరాఫీ
4. కవిత్రయంలో మొదటివారు ఎవరు?
   - నన్నయ
   - తిక్కన
   - ఎర్రాప్రగడ
5. భారతదేశంలో అన్నిటికంటె పెద్ద రైల్వే వంతెన ఏది?
   - సోన్
   - హౌరా
   - గోదావరి
6. టెలిఫోన్ కనిపెట్టింది ఎవరు?
   - వాట్సన్
   - ఫ్లెమింగ్
   - బెల్

[ 58-వ పేజి చూడు ]

## వినోదం

స్కూలు తణిఖీకోసం వచ్చిన డి. ఇ. ఓ. ఒక విద్యార్థిని ప్రశ్నించాడు: 'అబ్బాయీ!—ఒక వర్తకుడు ఒక వస్తువును రు. 12-6-0 కు కొని, రు. 10-12-0 లకు అమ్మితే అతనికి లాభమా, నష్టమా? ఎంత?'

ఆ కుర్రవాడు ఒక్కక్షణం ఆలోచించి, 'అణాలలో లాభమేకానీ, రూపాయల్లో నష్టం వచ్చిందండి' అని జవాబిచ్చాడు.

* * *

కొత్తగా అత్తవారింటికి ఒక అల్లుడు వచ్చాడు. అతన్ని ఎగతాళిచేయాలని బావమరదులు నిశ్చయించుకున్నారు. 'బావా బావా! మా నాన్న నీకు గడియారం కొనబోతున్నారు. బజారులో రెండు గడియారాలు బేరమాడి వచ్చాము. మొదటిది రెండేళ్లకు ఒకమారుకాని ఇంచుమించుగా సరైన టైము చూపించదట. ఐతే, రెండో గడియారంమట్టుకు రోజూ రెండుసార్లు సరైన టైము చూపిస్తుంది. ఈ రెండింట్లో నీకేది కావాలో కనుక్కోమన్నారు నాన్నగారు' అని చెప్పారు.

వాళ్ళు తలిచినట్టు ఆ అల్లుడు ఏమంత వెర్రిబాగులవాడు కాడు. 'రెండూ తెమ్మనండయ్యా! దీనికో పెద్ద ఆలోచనేమిటీ?' అన్నాడు, అల్లుడుగారు తడుముకోకుండా. బావలిద్దరూ తెల్లబోయారు.

బావలు ఆలోచించిన గమ్మత్తు ఇది-మొదటి గడియారం రోజుకు ఒక నిమిషంచొప్పున తేడా చూపిస్తుంది. రెండవ గడియారం అసలు తిరగటమేలేకుండా, నిలిచివుంది. పనిచేయని గడియారంలో తేడా ఏముంటుంది? రెండుసార్లేకాదు, మరెన్నిసార్లయినా ఒకే టయిము చూపిస్తుందికదా?




# సజీవ సమాధి

శిక్కుల నాయకుడు గురుగోవిందసింగు గొప్ప ప్రతాపశాలి. మొగలులకు, ముఖ్యంగా ఔరంగజేబుకు అతని పేరు చెబితే హడలుగా వుండేది. వీరిద్దరిమధ్య బద్ధవైరం. ఈ వైరం ఉన్నకొద్దీ పెరుగుతూవచ్చింది. వీలు దొరికిన ప్రతిచోటా శిక్కులూ, మొగలులూ పోరాడుకొనసాగారు. శిక్కులపై ఔరంగజేబు కసి నానాటికీ పెచ్చరిల్లింది.

'తలయెత్తకుండా ఈ శిక్కుజాతిని అణచివేసేయండి' అని అతను తన సేనాధిపతులకు ఆజ్ఞయిచ్చాడు.

ఒకసారి శిక్కులకూ మొగలులకూ 'కీర్తిపురం' అనే ప్రదేశంలో పోరు ప్రారంభమైంది. పోరుకు ముందు గురుగోవింద్‌వద్దకు మొగలులు రాయబారం పంపించారు: 'మీరు ఎదిరించబోయేది ఎవరినో ముందు తెలిసికొనండి. ఇదేమీ చిన్నచిన్న సామంతులను బెదిరించట మనుకున్నారేమో. గొర్రె పోయి కొండను ఢీకొనటంవంటిది. మీకు తగదు. ఇప్పుడైనా జగద్విజేతలైన మా ప్రభువువారివద్దకు వచ్చి క్షమాపణ కోరుకొని, ఇస్లాంమతంలో చేరండి' అంటూ మందలించారు.

రాయబారి ఈ మాటలు చెబుతున్నప్పుడు గురుగోవిందు కుమారుడు 'అజిత్' అక్కడనే ఉన్నాడు.

'ఇటుపై ఇలాంటి మనసు నొప్పించే మాట మరొక్కటి అయినా వెలువడిం

డి. లక్ష్మీకాంతం

దంటే, చూచుకో నీ బతుకు ఏమవుతుందో!' అంటూ, చర్రున ఖడ్గం దూసి, రాయబారి వైపు ఝుళిపించాడు.

ఆ సమయానికి చేసేదిలేక, ఆ రాయబారి ఖిన్నుడై మరలిపోయాడు. మరలిపోయిన రాయబారి అజిత్ పలికిన పలుకులను ఆవేదనతో సేనాధిపతులకు వెల్లడించాడు. ఇది విని, మొగలులు మండిపడ్డారు. ఇదివరకే రగులుతున్న స్పర్ధలకు తోడు,ఇది అగ్గిమీద గుగ్గిలం వేసినట్టయింది.

ఉభయపక్షాలమధ్యనూ పగలు ప్రబలమయినై. వైరం వృద్ధిఅయింది.

అటుతరువాత మరికొద్ది కాలానికే 'ఆనందపురం'వద్ద తీవ్రమైన సంఘర్షణ జరిగింది. మొగల్ సేనలు ముమ్మరంగా దెబ్బతీసినై. శత్రుధాకకు తట్టుకోలేకపోయారు శిక్కువీరులు. ఆ కోటను మొగలులు వెంటనే వశపరుచుకొన్నారు.

ఆ సంపట్లో, గురుగోవిందు తల్లి గుజిరీ, తన మనమలిద్దరనూ వెంటబెట్టుకుని తప్పించుకుపోయి, 'సిర్ హింద్' అనే మారుమూలప్రదేశం చేరుకుంది.

చేరుకున్నదేకాని, శత్రువులు ఆమెను వెంటాడడం మానలేదు. అంతలోనే




మొగలులు గుజిరీని, ఆమె మనమలనూ వెతికిపట్టి, ఆ పరగణాకు అధిపతి ఐన వజీర్ఖాన్ ఎదట పెట్టారు.

బాలురిద్దరినీ చూచీచూడటంతో వజీర్ఖానుకు ముచ్చటవేసింది. వాళ్లను శత్రువులుగా గణించటానికి బదులు, తనవాళ్ళుగానే చూచుకుని, కొలువులో పెట్టుకొన్నాడు. కాలం కులాసాగా గడిచిపోతున్నది.

ఒకనాడు వజీర్ఖాన్ ఆ పిన్నవాళ్ళతో మాటా పలుకూ ఆడుతూ, 'అబ్బాయిలూ!- మిమ్మల్ని విడిచిపెడతా మనుకోండి. అప్పుడు మీరేంచేస్తారు?' అని సరదాగా అడిగాడు.




అందుకు బాలురిద్దరూ 'సైన్యాన్ని సిద్ధ పరుస్తాం; నిన్ను చంపివేస్తాం!' అని తడుముకోకుండా సమాధానం చెప్పారు.

ఈ మాటను అట్టే మనసుకు పట్టించుకోలేదు, వజీరు. 'మరి, యుద్ధంలో మీరు ఓడిపోతేనో?' అని మళ్ళీ ప్రశ్నించాడు.

లిప్తకూడా యోచనచేయకనే, పసివాళ్లు 'నిన్ను చంపేవరకూ నిద్రపోము. పోరాడుతూనే వుంటాం' అని బదులుచెప్పారు.

పసివాళ్ల పౌరుషానికీ పట్టుదలకూ వజీరు విస్తుపోయాడు. ఈ వర్తమానం తెలియగానే మతగురువైన 'ఉలేమా' వచ్చాడు. వచ్చి, విచారణచేసి, బాలకులిద్దరకూ మరణశిక్ష విధించాడు. ఐతే, ఇస్లాంలో కలిస్తే క్షమిస్తామన్నాడు.

ఉలేమా తీర్పు బాలురకు తెలియజేసి, 'ఏమి? ఇస్లాంమతం పుచ్చుకొంటారా? ప్రాణాలు వదులుకొంటారా?' అని వాళ్లను అడిగి, తుదికోరిక చెప్పమన్నారు. కొదమ సింగాలవంటి ఆ బాలురిద్దరూ ఏకకంఠంతో 'ప్రాణాలే వదులుకొంటాం!' అంటూ, తమ వజ్రసంకల్పాన్ని వెల్లడించేసరికి, అందరూ ఆశ్చర్యభరితులయ్యారు.

అప్పుడు, ఉలేమా ఆజ్ఞను అనుసరించి, ఆ బాలవీరులను ఒక పెద్దగోడలో పెట్టి సమాధిచేయటానికి పూనుకొన్నారు. గోడ వరస ఒక్కొక్కటి కడుతూవున్నప్పుడల్లా 'ఏమి, ఇప్పుడైనా ఇస్లాం అంగీకరిస్తారా?' అని పసివాళ్లను అడుగుతూనే వచ్చారు.

వాళ్లు ఒప్పలేదు. చిట్టచివరివరసకడుతూ వున్నప్పుడుకూడా, కడసారి మళ్లీ ప్రశ్నించారు. పసివాళ్లు ఎంతమాత్రం బెసగలేదు.

చివరకు మొగలులు ఆ శిక్కు బాలురను జీవసమాధి చేసేతీరారు! ఈవిధంగా, బాలవీరులిద్దరూ ఆత్మార్పణమైపోయి, తమ వంశమర్యాదనూ, శిక్కుజాతి గౌరవాన్ని నిలిపి, త్యాగధనులయ్యారు!

# పువ్వులలో వాసన ఎక్కడినించి వస్తుంది?

పూలమొక్కలు ఒక ప్రత్యేకమైన తైలం తయారుచేస్తాయి. దానివల్లనే పూవులలో వాసన కలుగుతుంది. ఒకేజాతి మొక్కలు తయారుచేసిన తైలాలు సాధారణంగా ఒకేమోస్తరుగా వుంటాయి.

దీనికి ఒక మంచి ఉదాహరణ 'కర్పూరతైలం'. ఈ కర్పూరతైలం ఒక ప్రత్యేక జాతి మొక్కలనుండి వస్తున్నది. కార్బన్, హైడ్రొజన్‌ల కలయికవల్ల ఈ నూనె ఉత్పత్తి అవుతున్నది. ఈరకం నూనెలు తేలికగా గాలిలో ఎగిరిపోతయి. ఇందువల్లనే పూలవాసన మనకు చాలా దూరంనుంచికూడా తెలుస్తుంది. ఈ తైలాలవల్ల చాలా లాభాలు వున్నయి. మంచి సువాసన వేయటం, క్రిమికీటకాదులను దరిచేరనీయకపోవటం, కీటాణువులనుండి మనల్ని రక్షించటమున్నూ. ఈ తైలాలన్నీ కీటాణువుల్ని సులువుగా సంహరించగలవు.

వాస్తవానికి మొక్కలు, తమ లాభంకోసమే ఈ నూనెలు తయారుచేస్తున్నై. సువాసన తరుచు పూవులలోనే వుంటుంది కాని, ఆకులలోనూ, వేళ్లలోనూ, చిగుళ్లలోనూ ఉండదని మనకు తెలుసు. అసలు పువ్వులనేవి ఎందుకున్నవో తెలుసుకుంటే, దీని తాత్పర్యం మనకు బోధపడుతుంది. పువ్వులుండేది–నేలమీద రాలి, మళ్లీ కొత్తమొక్కలను పుట్టించే విత్తనాలను దాచివుంచేందుకు.

ఈ విత్తనాలను నాటడానికి, సామాన్యంగా పురుగూ పుట్రావచ్చి సిద్ధం చేస్తవి. ఈ పురుగూ పుట్రా అదేజాతికి చెందిన ఇతర పూలమీద కూచునివస్తాయి. వచ్చేటప్పుడు తమవెంట ఒక ప్రత్యేక పదార్థాన్ని పట్టుకవస్తాయి. అది కలిస్తేగాని ఈ పువ్వులలోని విత్తనాలు నాటడానికి సిద్ధంకావు. దీనివల్ల పువ్వులు, పురుగూబుట్రని తమవైపు ఆకర్షించటం అగత్యమన్న సంగతి మనకు తెలుస్తున్నది. ఇందువల్లనే మొక్కలు తమ పూవులను అందంగా, మంచి సువాసనగా పుట్టించగల్గుతున్నాయి.

ఐతే, కొన్నిపువ్వులలో సువాసన ఎందుకు ఉండదూ? అని ప్రశ్న. ఇలాంటి పువ్వులలో విత్తనాలు సిద్ధంచేసేది పురుగూ బుట్రా కాదు; వాయువు. అందువల్ల ఈ పువ్వులకు సువాసన అక్కరలేదు. అవిచూడటానికికూడా చిన్నవిగా ఉంటవి. కొన్నిపూలు చూడటానికి చిన్నవిగా ఉన్నా, తమ తీవ్రమైన సువాసనతో పురుగూ బుట్రను ఆకర్షిస్తాయి.




# జీవజలం

కుండలరాజ్యాన్ని పరిపాలించే మహారాజుకు విచిత్రమైన వ్యాధి ఒకటి పట్టుకుంది. ఆ వ్యాధి తీరని దాహం. ఎన్ని మంచినీళ్ళు తాగినా, ఎన్నిరకాల పానీయాలు, ఔషధాలు తాగినా ఆయన దాహం తీరటంలేదు. చివరకు మంచంపట్టాడు. రకరకాల మందులూ, మంత్రాలూ ప్రయోగించారు. వ్యాధిమాత్రం తిరుగుముఖం పట్టలేదు. రాజ్యమంతా తల్లడిల్లిపోయింది.

ఆ రాజుకు సంతానం లేదు. తల్లీ తండ్రీ లేని ముగ్గురు మేనల్లుళ్ళు మాత్రం ఆయన ఆశ్రయంలో బతుకుతున్నారు.

ఒకనాడు మేడముందున్న తోటలో విచారంగా ఆ అన్నదమ్ములు ముగ్గురూ పచారుచేస్తున్నారు. అప్పుడు వృద్ధుడయిన తోటమాలి కనుపించి—

"అబ్బాయిలూ! ఈ వైద్యులేమీ చేయలేరు. ఈ విచిత్రవ్యాధినుంచి కాపాడగలిగింది 'జీవజలం' ఒక్కటేనని నేను చిన్నప్పుడు విన్నాను" అని చెప్పాడు.

'ఐతే జీవజలం ఎక్కడ దొరుకుతుంది?' అని ఆత్రంగా ప్రశ్నించారు అన్నాదమ్ములు.

'అదినాకు తెలియదు. కాని తూర్పుదిక్కున దొరుకుతుందని మాత్రం విన్నాను' అన్నాడు తోటమాలి.

మరుసటిరోజు ప్రొద్దునే అన్నదమ్ములలో పెద్దవాడు రాజు అనుమతి తీసుకొని, మంచి గుర్రాన్ని యెక్కి, జీవజలంకోసం తూర్పుదిక్కుగా బయలుదేరాడు. పోగాపోగా కొన్నిరోజులకు రెండు కొండలమధ్యను ఒక లోయ కనుపించింది. ఆ లోయలోనుంచి వెళ్ళగా, కొండమీద తపస్సు చేసుకుంటూ

సి. వరలక్ష్మి

ఉన్న ఒక ఋషి కేకవేసి—' పిన్నవాడా, ఎక్కడికీ ప్రయాణం ?' అని పలకరించాడు.

"పోవయ్యా ముసలాయనా! నీగొడవ నువ్వు చూసుకో" అన్నాడు పెద్దవాడు యీసడిస్తూ.

"సరే, నీఖర్మం!" అన్నాడు ఋషి.

పెద్దవాడు అలా మరికొంత దూరం వెళ్లేసరికి కొండల మధ్యవున్న లోయ క్రమంగా కుంచించుకుపోయి గుర్రం కదలడానికైనా ఖాళీలేనంత యిరుకైపోయింది. దారిలేక, అతడు అక్కడే వుండిపోయాడు.




యెంతకాలానికీ పెద్దవాడు తిరిగి రాకపోయేసరికి, మరో గుర్రంమీద రెండవవాడు బయలుదేరాడు. పోయిపోయి అతడూ అదే లోయకు చేరుకొన్నాడు.

కొండమీద తపస్సు చేసుకుంటూవున్న ఋషి రెండవవాణ్ణికూడా అలానే పలకరించాడు. రెండవవాడూ అన్నలాగే యీసడించేసరికి "సరే, నీఖర్మం!" అని వూరుకున్నాడు ఋషి.

రెండవవాడు మరికొంత దూరం వెళ్లేసరికి పెద్దవాడికి పట్టిన గతే పట్టింది. అతడూ అక్కడే వుండిపోయాడు.

ఎంతకాలానికీ రెండవవాడూ రాకపోయేసరికి మూడవవాడు బయలుదేరాడు. అతడూ అదే కొండలోయనుంచి గుర్రంమీద పోతున్నాడు. అంతకుముందు ఋషి అన్నలిద్దరినీ ప్రశ్నించినట్టే మూడవవాణ్ణీ ప్రశ్నించాడు. అందుకు వాడు వినయంగా—

"కుండలరాజ్యాన్ని పరిపాలించే మా మామగారు తీరని దాహంతో బాధపడుతున్నారు. నేను జీవజలం తెచ్చేందుకని వెళుతున్నాను" అన్నాడు.

ఆ మాటలకు ఋషి సంతోషించి "ఐతే, అబ్బాయీ! నువ్వు ఆ జీవజలం కోసం ఇంకెంతో దూరం పోనవసరంలేదు. అదుగో ఆ కనబడే గిరిశిఖరందగ్గిరకు పో. అక్కడ




ఒక పెద్ద రాతిద్వారం వుంటుంది. నేను ఇచ్చే యీ కమండలంతో ఆద్వారంమీద కొట్టావంటే ద్వారం తెరుచుకుంటుంది. కాని అదేసమయంలో రెండు సింహాలు నీమీదకు దూకుతై. వాటికి ఈ మంత్రించిన గడ్డిదుబ్బులు విసిరివెయ్యి. అవి గడ్డిమేసే లోపల సరోవరంలోంచి జీవజలం తీసుకుని, బయటికివచ్చేసెయ్యి. తోవలో ఒక విగ్రహం ఉంటుంది. దానిమీద కొంచెం జలం చల్లు" అని చెప్పాడు.

ఋషికి నమస్కరించి, మూడవవాడు కమండలం, గడ్డి దుబ్బులూ తీసుకుని సరాసరి ఆ రాతిద్వారం దగ్గిరకు పోయాడు.

కమండలంతో ద్వారాన్ని తాకగానే అది తెరుచుకోవడం, అదేసమయంలో రెండు సింహాలు గోండ్రిస్తూ అతనిమీదికి దూకటం జరిగింది.

ఋషి చెప్పినట్టే గడ్డిదుబ్బుల్ని వాటి ముందు పడవేసి మూడవవాడు సరాసరి లోపలకు పోయాడు. అక్కడ విశాలమైన పూలతోటా, అందులో సరస్సూ కనిపించినై. ఆ సరస్సునుంచి తన చెంబునిండుగా జీవజలం తీసుకుని వెనుదిరిగే సరికి, సమీపంలోనే ఒక స్త్రీవిగ్రహం కనిపించింది. ఋషిచెప్పిన విగ్రహం ఇదేకాబోలని మూడవవాడు దానిమీద కొంచెం జీవజలం చల్లాడు. వెంటనే ఆవిగ్రహం ప్రాణం పోసుకొని ఒక చక్కని రాజకుమారిగా రూపొందింది. 'నీ వెవరవు? ఎందుకని నీకు ఈ గతిపట్టింది?' అని అడిగాడు మూడవవాడు.

అందుకు ఆమె "నేను ఈ రాజ్యానికి రాణిని. దేవతల శాపంవల్ల నా రాజ్యం పాడుబడిపోయింది. నేనొక శిలావిగ్రహాన్ని ఐపోయాను. ఈ శాపంనుంచి విడిపించినందుకు మీకు కృతజ్ఞురాలిని. సంవత్సరం తరవాత మీరు తిరిగి యిక్కడికి రావాలెనని నాకోరిక. తప్పక రండి" అన్నది.




'అలాగే వస్తా' నని వాగ్దానంచేసి, మూడవవాడు జీవజలంతో ఇంటికి బయలు దేరాడు. దారిలో ఋషిని మళ్ళీ దర్శించి, తన అన్నలనుకూడా రాతిచెరనుంచి విడి పించమని కోరాడు.

ఋషి జరిగినదంతా చెప్పి, 'నీ అన్న లనుగురించి జాగ్రత్తగా వుండు సుమా!' అంటూ సలహాయిచ్చాడు. కల్లా కపటం తెలియని మూడవవాడు, సరేమిరా అన్నాడు. ఋషి ఒప్పుకొనక తప్పిందికాదు.

కొద్దిరోజులకల్లా యింటికి చేరుతారనగా అన్నలిద్దరూ మూడవవాడి కనుగప్పి, ఆ జీవజలం దొంగిలించి, అతడి కమండ లంనిండా వుప్పనీళ్ళు నింపారు. దీనివల్ల రాకుమార్తెను తామే పరిణయం ఆడవచ్చు నని వాళ్ళు ఆశించారు.

సోదరులు ముగ్గురూ తిరిగి వచ్చేసరికి రాజు వ్యాధి ఏమాత్రమూ తిరుగుముఖం పట్టలేదు. మూడవవాడు తనకు జరిగిన మోసం తెలియక, తెచ్చినది జీవజలమే అనుకుని ఆ వుప్పనీళ్లు మామకుఇచ్చాడు.

ఆ జలం గొంతులో పోసుకుంటూనే రాజు వుక్కిరిబిక్కిరయ్యాడు. మూడవ వాడికేసి చూచి, ఉగ్రుడయాడు. అప్పుడు పెద్దవాళ్ళిద్దరూ తాము మాయచేసి తెచ్చిన జీవజలం రాజు కిచ్చారు. వెంటనే రాజు వ్యాధి కుదిరిపోయింది. అప్పుడు మూడవ వాడు మోసకారి అని భావించి వానిని రాజ్యాన్నుంచి వెడలగొట్టాడు రాజు.

వెడలగొట్టబడిన మూడవవాడు అడవుల లోనే నివాసం ఏర్పరుచుకున్నాడు. ఆనాడు అతనిచేత రక్షింపబడిన రాజకుమారి, సం వత్సరం గడిచినప్పటికీ అతను తిరిగిరాక పోపటంతో, సేవకులను పిలిపించి–

"రాతిద్వారందగ్గిరనుంచి ఒక మైలు పొడుగున ఒక బంగారుబాట నిర్మించండి. ఎవరైనాసరే బాటమధ్యగా గుర్రంమీద వస్తే

ద్వారం తెరవండి. బాటకు అటూ యిటూ పక్కగా వచ్చేవారికిమాత్రం ద్వారం తెరవ కండి" అని ఆజ్ఞయిచ్చింది.

మూడవవాడు ఎటో దేశాలుపట్టి పోయా డని నిశ్చయించుకున్న పెద్దవాడు, రాకుమా ర్తెను వివాహం చేసుకోవాలనే దురుద్దేశంతో ఒకనాడు గుర్రాన్నిఎక్కి రహస్యంగా బయలు దేరాడు. సరిగా బాటవద్దకు వచ్చేసరికి—

"ధగధగమంటున్న యీ బంగారు బాటమీద నా గుర్రాన్ని నడిపితే పాడై పోతుందే. తప్పుకొని ఒక పక్కగా వెళ్తాను" అనుకుంటూ, బాటకు కుడివైపుగా వెళ్ళి రాతిద్వారం తట్టాడు. ద్వారంపక్కనే కంతలలోనించి చూస్తూవున్న రాణీసేవ కులు వానిని గెంటివేశారు.

తరవాత రెండవవాడు వెళ్ళాడు. వాడూ బంగారుబాట చూసి అన్నలాగే గుర్రాన్ని బాటకు ఎడంపక్షగా నడుపుకొని పోయాడు. వాడికీ రాణిసేవకులు శాస్తిచేశారు.

మరికొంత కాలానికి మూడవవాడు బయలుదేరాడు. వాగ్దానంచేసి, చెప్పిన విధంగా సంవత్సరానికల్లా రాణిదగ్గరకు వెళ్లలేకపోయానే అనే ఆత్రం ఒక్కటే అతని మనసును గట్టిగా పట్టివున్నది. ఆ ఆత్రంతో, మరొక యోచన ఏదీ మనసులో లేకుండా, బాటనే గమనించకుండా, సరాసరి బాటమధ్యగా గుర్రాన్ని దౌడుతీయిస్తూ పోయి, రాతిద్వారం తట్టాడు. సేవకులు తక్షణమే ద్వారం తెరిచారు.

రాకుమారికీ, మూడవ వానికీ అతి వైభవంగా వివాహం జరిగిపోయింది. తరవాత ఆ దంపతులిద్దరూ కుండల రాజ్యానికి వచ్చి జరిగినదంతా రాజుకు విన్నవించారు.

అన్నలిద్దరి మోసం గ్రహించిన రాజు ఇప్పుడు మొదటివాడినీ, రెండవవాడినీ దేశంనుండి బహిష్కరించి, మూడవవాడికి తన రాజ్యమిచ్చి పట్టంకట్టాడు.



# ఇది చేయటం నీవల్ల అవుతుందా?

(1) పెన్సిలు ఎత్తకుండా 100 గీసి, దాని చుట్టూ సున్న చుట్టగలవా?
ఎలా చేయటం?—



ఒక కాగితం తీసుకో. ఆ కాగితానికి పైభాగం మడుచుకో. ఒకటి అంకెనుంచి ప్రారంభించి, సరిగా పటంలో చూపినట్టు గీతగియ్యి. తరువాత పైభాగమందు మడిచిన కాగితాన్ని తీసివెయ్యి. ఇప్పుడు నీకు 100 అంకే, దాని దిగువని ఒక అర్ధచంద్రాకారమూ స్పష్టంగా కనిపిస్తయి.

(2) ఒక్కొక ప్రక్కన మూడేసి అగ్గిపుల్లలతో చదరం ఏర్పరుచు. ఇలా ఏర్పడిన చదరంలోపల మరి ఏడు అగ్గిపుల్లలను పేర్చి, చదరాన్ని మూడుభాగాలుగా విభజించు. ఆ మూడుభాగాలూ సరిసమానమైన విస్తీర్ణం కలిగి వుండాలి. చెయ్యగలవా?
ఎలా చేయటం?—




పటంలో చూస్తే, ఏవిధంగా భాగించాలో తెలుస్తుంది. ఏర్పడిన మూడుభాగాలనూ కొలిచిచూస్తే, అవి సరిసమానమైన విస్తీర్ణం కలవనికూడా బోధపడుతుంది.

(3) ఒక పదిరూపాయల నోటును రెండు గ్లాసులుపైన ఉంచి, ఆ నోటుమీద ఎన్నయినా నాణాలను నిలబెట్టగలవా?
ఎలా చేయటం?—



రెండు గళాసులు తీసుకో. ఒకదానికీ రెండవదానికీ మధ్యని మూడు అంగుళాల దూరం ఉండేటట్టు పెట్టు. తరువాత ఒక కొత్త పదిరూపాయలనోటు తీసుకో. దానిని నిలువునా సగానికి మడుచు. ఆ నోటు అవతలభాగాన్ని, ఇవతలభాగాన్నీ మళ్ళీ నిలువునా సరీగా సగానికి మడుచు. ఆనోటును గళాసులు రెండిటిపైనా నిలబెడితే, M విధంగా ఉంటుంది. ఇప్పుడు నీవద్దనుండే నాణాలను తీసి నోటుకు ఏర్పడిన రెండు కోసులపైన నిలబెట్టు. దాని పైన ఎన్ని నాణాలు పేర్చినా, ఎంతో పొందికగా చెక్కుచెదరకుండా నిలబడతై.

## వింత డబ్బు

డబ్బుతో పనిలేనివాళ్లు ప్రపంచంలో ఉండరు. కాని ప్రపంచంలో మనకు చాలా దూరంగా వున్న కొన్ని భాగాలలో డబ్బు కొన్ని వింతరూపాలను ధరిస్తుంది. కొన్ని చోట్ల జనులు నాణాలు దొరికినప్పుడు వాటితో దండలు గుచ్చుకోవటమో, లేక వాటిని పాతిపెట్టడమో మంచిదని అనుకొంటారు. మచ్చుకి —

1. న్యూగినీలో పందులను పెద్ద మొత్తాలుగానూ, ఆల్చిప్పల దండలను చిన్న మొత్తాలుగాను వాడతారు.
2. సోలమాన్ దీవులలో సొరచేప పళ్ళూ, ఆల్చిప్పల దండలూ, చెలామణీలో ఉన్నవి.
3. ఇక్కడా, దగ్గిరలో వుండే న్యూగినీలోనూ, పనిచేసే కూలీలకు జీతంకింద పొగాకు ఇస్తే వాళ్ళు చాలా సంతోషిస్తారు.
4. మొరాకోలోని కొన్ని ప్రాంతాలలో సైంధవలవణం డబ్బుగా వాడబడుతుంది.
5. మధ్యని చిల్లులుండే నాణాలు కనిపెట్టింది చైనావారు. అవి దండలుగా గుచ్చుకొంటే, ఎక్కడికైనా తేలికగా పట్టుకపోవచ్చునని వారి అభిప్రాయం.
6. అలాస్కా వద్ద కొన్ని దీవులలో చేపల గాలాలు డబ్బుగా వాడబడుతున్నవి.
7. మధ్యఆసియా కొన్ని ప్రాంతాలలోనూ, తుర్కిస్థాన్‌లోనూ తేయాకులను ఇటుకలుగా అచ్చుపోయించి, డబ్బుగా వాడతారు.
8. మంగోలియాలో వింతగొలిపే కొన్ని వెండినాణాలు పడవల ఆకారాలలో వుంటాయి.

## మూడు దెబ్బలు

జంతుప్రపంచంలో మూడువస్తువుల దెబ్బ చాలా భరింపరానిదిగా వుంటుంది. ఆ మూడూ ఏమిటో తెలుసా ?—

1. తిమింగిలం తోకదెబ్బ
2. జిరాఫీ కాలి తన్ను
3. సింహం కొట్టే పంజాదెబ్బ

వీటిలో ఏది తగిలినా బతకటం దుర్లభమే అని చెప్పవచ్చు.

# అట్టచివరి బొమ్మ

అటుతరవాత ఆ హస్తాలు వచ్చి కృపాసేనుణ్ణి ఒక అందాల గదిలోపలికి తీసుకపోయినై. చక్కా తలదువ్వినై. విలువయిన రాజదుస్తులతో ముస్తాబుచేసినై. ఇటువంటి అలంకరణ కృపాసేనుడు ఎన్నడూ చూచిఎరగడు.

అంతలోనే మరికొన్ని హస్తాలు వచ్చి, అతనిని బ్రహ్మాండమైన హాలులోపలకు తీసుకవెళ్ళినై. అక్కడ ఒక గొప్ప విందుకోసం యేర్పాటులు అమరబడివున్నయి. హాలుమధ్యని ఇద్దరు పెద్దలకోసమని ప్రత్యేకించి రెండు సింహాసనాలు వేసివున్నయి. ఒకదానిలో హస్తాలు కృపాసేనుణ్ణి తీసుకపోయి కూర్చోబెట్టినై.

ఆశ్చర్యం పొందాడు అతను, రెండవస్థానాన్ని ఆక్రమించేది యెవరా? అని చూస్తూవుండగా ఊరేగింపుతో పెద్ద పిల్లుల పటాలం వచ్చి దిగింది.

అందులో ఒక పిల్లి మేలిముసుగు తీసివేసి తిన్నగా వచ్చి, రెండవ సింహాసనంలో కూర్చున్నది. పరివారమంతా జేజేలుకొట్టారు. ఆ మార్జాలం అపరూపమైన రాజదుస్తులు ధరించివున్నది! సభాసదులందరూ బంగారు బోనులలో ఎలుకలను పట్టితెచ్చి, తయారుగా వున్నారు.

సింహాసనంలో కూర్చున్న మార్జాలం కృపాసేనుని పేరుపెట్టి పిలుస్తూ, 'నీకోసమే ఇంతకాలంగా ఎదురుచూస్తున్నా' మన్నది. తరువాత, రాజవిందులు జరిగినై. అతిథి ఐన కృపాసేనుణ్ణి మార్జాలం ఆదరించిన తీరు వర్ణించటానికే అలవికాదు. ఆమెగదిలో ఒక పటమున్నది. కృపాసేనుడు దగ్గరకుపోయి చూడగా అది తనపటమే !! అది చూచి అతను అమితాశ్చర్యం పొందాడు. ఐతే, ఆ పటం అతనికి చూపిస్తూ, సంతోషించటానికి బదులు మార్జాలం విచారింపసాగింది.

తరువాత గానసభలూ, నృత్యాలూ జరిగినై. కృపాసేనుడికి నిద్రపట్టేసింది. అతను నిద్రలేచిన తరువాత మళ్ళీ విందులు, విహారాలు, మరి ఎన్నో వేడుకలూ జరిగినై. ఇన్నిజరిగినా, కృపాసేనుడు ఆలోచనలోపడినట్టు కనపడగా, మార్జాలం కారణం చెప్పమంది. అప్పుడు అతను తను వచ్చిన పని చెప్పాడు. 'ఈ మాత్రానికేనా విచారం?' అంటూ ఆ మార్జాలం, కనివిని ఎరుగని ఒక చక్కదనాల చిన్నారి కుక్కబొమ్మను పెట్టిలోనుంచి తీసి యిచ్చింది.

ఇస్తూ, మరికొంతకాలం తనభవనంలోనే ఉండిపొమ్మన్నది. కృపాసేనుడు మళ్ళీవస్తానని మాటయిచ్చి, ఇంటిముఖం పట్టాడు.

ఒంటిగీత బొమ్మ



పంపినవారు :
పారేపల్లి వేంకటేశ్వర్లు - అమరావతి

## సవరణ

ఫిబ్రవరి చందమామ 'బదులు చెప్పు' ప్రశ్నలకు జవాబులు :
ఇందులో 4-వ సమస్యకు జవాబు 'వ్యాసుడు' కాదు. 'వాల్మీకి' అని ఉండాలి.

'బదులుచెప్పు' ప్రశ్నలకు జవాబులు :

1. మిసిసిపి
2. బిన్‌కాశిమ్
3. జిరాఫీ
4. నన్నయ
5. సోన్‌వంతెన
6. బెల్

# ఫోటో వ్యాఖ్యల పోటీ

## ఏప్రిల్ ఫొటోల ఫలితాలు

★

ఏప్రిల్ నెల చందమామలో ప్రచురింపబడే ఫొటోలకుగాను, మాకు వచ్చిన వ్యాఖ్యలలో ఉత్తమంగా వున్న ఈ దిగువ వ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది.

వ్యాఖ్యలు :

మొదటి ఫొటో : పిల్లవాని ప్రేమధనము
రెండవ ఫొటో : గొల్లవాని మూలధనము

పంపినవారు :

జె. సత్యనారాయణప్రసాద్,
S/o జె. ఎమ్. నాయుడు, ఏలూరు

బహుమతిపొందిన ఈ వ్యాఖ్యలు, పంపిన వారి పేరుతోసహా మార్చి చందమామ ఫొటోల దిగువని ప్రచురిస్తాము. బహుమతి మొత్తం రూ. 10/- ఏప్రిల్ సంచిక వెలువడిన వెంటనే పంపబడుతుంది.

★

## మే నెలలో

ప్రచురింపబడే ఫొటోల నమూనాలు వివరాలతోసహా ప్రక్కపేజీలో చూడండి.

ముఖ్యసూచన :

వ్యాఖ్యలను ప్రక్కపేజీలోని కూపన్‌లోనే పూర్తిచేసి పంపాలి. పూర్తిచేసిన కూపన్‌ను బుక్‌పోస్టులో పంపవచ్చు. ఇందుతో ఎటువంటి జాబులను జతపరచకూడదు.

## ఫోటోవ్యాఖ్యల పోటి :: బహుమానం రు. 10 లు

1953 మే సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై రెండు ఫోటోలకూ సరిఐన వ్యాఖ్యలు కావాలి. వ్యాఖ్య ముచ్చటైన ఒక్క మాటలో గానీ, చిన్నివాక్యంలోగానీ ఉండవచ్చు. మొదటిఫోటోకూ రెండవ ఫోటోకూ వ్యాఖ్యలు సంబంధం కలిగివుండాలి.

★ మార్చి 15-వ తేదిలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ దిగువ కూపన్‌లో వ్యాఖ్యలు రెండూ పూర్తి చేసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటోవ్యాఖ్యల పోటీ, మద్రాసు - 26.

★ చందమామ కూపన్లలోగాక, ఇతర విధముల పంపే వ్యాఖ్యలు పోటీకి పనికిరావు.

→ చందమామ ఫోటోవ్యాఖ్యల పోటీ కూపన్ ←

మొదటి ఫోటో

వ్యాఖ్య ....................................

రెండవ ఫోటో

వ్యాఖ్య ....................................

పంపినవారి పేరు ....................................

పూర్తి చిరునామా....................................



వస్తూంది!

విజయ వారి

# చంద్రహారం

డైరెక్టర్
కె. కామేశ్వరరావు
బి.ఏ.



నిర్మాతలు... నాగిరెడ్డి & చక్రపాణి

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him from Chandamama Publications, Madras 26, Controlling Editor: SRI CHAKRAPANI.

Photo by Pranlal K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

కలిమి గాథ

పంపినవారు:
ఆర్. లక్ష్మీనారాయణ - ట్రిప్లికేన్




రంగులబొమ్మ కథ — 3 - వ బొమ్మ